# చందమామ

సంపుటి 103 ఆగస్ట్ 2000 సంచిక 2



## ఈ సంచికలో...

### కథలు



### జానపద సీరియల్



### పౌరాణిక సీరియల్



### చారిత్రక విశేషాలు



### శీర్షికలు



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

### ఈ నెల విశేషాలు

మహోన్నతుడు
(బేతాళ కథ)



రంగడికథ





కనకయ్య బంగారం

భారత సంస్కృతి చరిత్ర



దూర తీరాల్లో వున్న

## మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ
ఏకైక బహుమతి



# చందమామ

వారిభాషల్లో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ
మలయాళం,మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకు
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు
పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ
చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది
చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI–600 026

సంపాదకుడు
విశ్వం

ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్- 600 026
ఫోన్/ఫ్యాక్స్: 4841778
4842087
ఇ. మెయిల్: Chandamama@ vsn lcom

ముంబాయి కార్యాలయం
2/B, నాజ్ బిల్డింగ్స్
లామింగ్‌టన్ రోడ్,
ముంబాయి-400 004
ఫోన్: 022-388 7480
ఫ్యాక్స్: 022-388 9670

అమెరికాలో
విడికాపీ $2
సంవత్సర చందా $20
సొమ్ము పంపవలసిన చిరునామా:
ఇండియా అబ్రాడ్
43 వెస్ట్ 24 స్ట్రీట్
న్యూయార్క్, ఎన్.వై 10010
ఫోన్: (212) 929-1727
ఫ్యాక్స్: 212-627-9503



సంచాలకులు
చక్రపాణి. బి.నాగిరెడ్డి

# ఆత్మపరిశీలన అవసరం!

నూతన శతాబ్దానికి ఆరంభం అనుకున్నా, ఈ శతాబ్దానికి ఆఖరి సంవత్సరం అనుకున్నా, 2000 వ సంవత్సరం ముఖ్యమైనదే. ఈ ముఖ్యమైన సంవత్సరంలో వచ్చే స్వాతంత్ర్యదినం ఆగస్టు పదిహేను ప్రాముఖ్యత ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు.

యాభైమూడేళ్ళకు పూర్వం భారత్ స్వతంత్ర దేశమయింది. కొన్ని దేశాలను సర్వనాశనం చేసిన రెండవ ప్రపంచయుద్ధం అంతకు కొంచెం ముందే ముగిసింది. ఉదాహరణకు, జపానుదేశాన్ని తీసుకున్నట్టయితే, అక్కడి రెండునగరాలు అణు బాంబుల తాకిడికి భస్మమైపోయాయి.అయితే, ఈనాడుప్రపంచంలోబాగా అభివృద్ధి చెందిన దేశాలలో ఒకటి జపాను! మనకు పొరుగున వున్న అతిచిన్న దేశం సింగపూర్ కూడా అంతే త్వరితగతిలో అభివృద్ధి సాధించింది!

మరి మనదేశంలో మాత్రం అలాంటి అభివృద్ధి ఎందుకు సాధ్యం కావడం లేదు? ఆత్మ పరిశీలన చేసుకోవలసిన సమయం ఇది!

మన శాస్త్రవేత్తలూ, సాంకేతిక నిపుణులూ చాలామంది పాశ్చాత్య దేశాల ప్రగతికి కృషి చేస్తున్నారు. అలాంటి వారివల్ల మనం ఎందుకు ప్రయోజనం పొందలేక పోతున్నాం? మనదేశంలో ఏదీ సక్రమంగా జరగదు అని వాళ్ళంటున్నారు. ముఖ్యంగా ప్రభుత్వ యంత్రాంగం సానుభూతితో, సానుకూలంగా వ్యవహరించడం లేదు. ఈ పరిస్థితిని సరిపెట్టుకుని ఊరుకోవలసిందేనా?

మన జనాభా పెరుగుతోంది. ప్రకృతి వైపరీత్యాల బీభత్సం కొత్త కొత్త సమస్యలను సృష్టిస్తోంది. దేశాభివృద్ధి సాధించి తీరాలనే దృఢసంకల్పం, పట్టుదల, కృషి ఉంటే తప్ప మన కష్టాలు కడతేరవు.

ప్రభుత్వ యంత్రాంగం అంటే ఏమిటి? అందులో పనిచేసేవారు మనలాంటి వారూ, మన బంధువులూ, మిత్రులే కదా? కాబట్టి మనదేశ భవిష్యత్తు మన చేతుల్లోనే ఉన్నది. బాగుపరచడం, పాడుచేయడం రెండూ మన చేతలమీదే ఆధారపడి ఉన్నాయి. దానిని నిర్ణయించవలసిన సమయం ఇది. మనం నిజాయితీతో పనిచేయాలి. దేశం కోసం, దేశభవిష్యత్తుకోసం ప్రతి ఒక్కరూ చిత్తశుద్ధితో కృషి చేయాలి.

# చందమామ కబుర్లు

## వయసు సమస్య కాదు!

ఈ కాలపు పిల్లలలో తరగతులకు హాజరు కాకుండా, చదువంటే ఆసక్తి లేని వారంటూ అంతగా లేరు. ఏ కొందరో చదువుపట్ల అంతశ్రద్ధ కనబరచకుండా సోమరితనంగా కనిపిస్తారు. అలాంటి వారికి రాజ్‌కిషోర్ పాండేకథ వింటే తామూ చదవాలనే స్ఫూర్తి కలుగుతుంది. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో సెక్యూరిటీగార్డ్‌గా పనిచేస్తున్న 44 సంవత్సరాల పాండే, ఇటీవల పిహెచ్.డి. పట్టాకోసం పరిశోధనావ్యాసాన్ని సమర్పించాడు. ఉత్తర ప్రదేశ్ నుంచి 12వ తరగతి పాసయిన సర్టిఫికేట్‌తో 1980వసం॥లో ఢిల్లీకివచ్చి అతడు విశ్వవిద్యాలయంలో రోజువారీకూలీగా చేరాడు. ప్రైవేట్‌గా చదివి బి.ఏ., ఎం. ఏ. డిగ్రీలు సాధించాడు. అదే సమయంలో పెళ్ళి చేసుకుని నలుగురు పిల్లలకు తండ్రికూడా అయ్యాడు.



పి.హెచ్.డి. పరిశోధన కోసం విశ్వవిద్యాలయానికి విన్నపం చేసుకుంటే– కనీసం రెండేళ్ళు జీతంలేని సెలవుపుచ్చుకోమని సలహాఇచ్చారు. అన్నాళ్ళు జీతం లేకపోతే కుటుంబాన్ని ఎలా పోషించడం? ఆయనకు వరసగా రాత్రి డ్యూటీ ఇప్పించి విశ్వవిద్యాలయం సహాయం చేసింది. "ఆధ్యాత్మ రామాయణం-ఆనందరామాయణం: తులనాత్మక పరిశీలన" అనేతనపరిశోధనావ్యాసాన్ని పూర్తి చేయడానికి ఆయన ఎన్నోరాత్రులు నిద్రలేకుండా గడిపాడు. మార్పులతో చేర్పులతో వందరకాల రామాయణాలు ఉన్నాయని ఆయన అభిప్రాయ పడుతున్నాడు.

ఇది వేరొక రకమైన విశేషం: మధ్య ఇటలీకి చెందిన మరియా లూయిసా పీట్రరోయా అనే ఆవిడ సెప్టెంబర్‌లో 'ప్రీస్కూల్'కు వెళ్ళనుంది. 105 సంవత్సరాలకు పూర్వం ఆమె పుట్టినప్పుడు ఇలాంటి ప్రీస్కూల్ పద్ధతి లేదు. ఆ తరవాత కూడా ఆమెఎప్పుడూ స్కూలుకువెళ్ళిన పాపాన పోలేదు.

## బరువు తగ్గించడానికి

స్కూలుకు వెళ్ళే పసిపిల్లలు శక్తికి మించిన పుస్తకాల బరువులు మోయడం మన దేశంలో సర్వసాధారణమైన విషయం. సింగపూర్‌లోనూ ఈ కథ ఇంతే. అందువల్ల అక్కడి విద్యారంగానికీ, వ్యాపారరంగానికీ, చెందిన కొందరు నిపుణులు పిల్లల బరువు తగ్గించడానికి స్కూల్ బ్యాగ్‌లను కొత్త డిజైన్లలో రూపొందించారు. బ్యాగులు మోసే పిల్లలు తరచూ వీపునొప్పి, భుజాల నొప్పి అని అంటారు. పుస్తకాలతోపాటు పెద్ద పెన్సిల్‌బాక్సులూ, ఆటవస్తువులూ, వాటర్ బాటిల్స్ అంతా కలిసి మోపెడవుతోంది. కొత్త మోడల్ స్కూల్ బ్యాగ్‌లో తగిలించుకునే చోట మెత్తగా వుండే 'ఫోమ్', కుదింపులు తగ్గించే 'కంప్రెషన్ స్ప్రింగ్' అమర్చి వున్నారు. ఇలాంటి స్కూలు బ్యాగులు మన దేశంలో వచ్చే విద్యా సంవత్సరం నుంచి రాగలవని ఆశించ వచ్చు.



## బీడీల దిగుమతిపై నిషేధం!

మన దేశంలో ముఖ్యంగా దక్షిణాదిలో బీడీలు కాల్చే వాళ్ళెక్కువ. సిగరెట్లకన్నా ధర తక్కువ గనక, పేదలు ఎక్కువగా బీడీలే కాలుస్తూంటారు. ఇటీవల బీడీలను విదేశాలకు ఎగుమతి చేయడం మొదలుపెట్టారు. ఇది కొంత విదేశీ మారక ద్రవ్యాన్ని తెచ్చిపెడుతున్నది.అయితే, మన దేశం నుంచి బీడీల దిగుమతిని అమెరికా నిషేధించింది. బీడీ పరిశ్రమలో ఎక్కువగా పిల్లలు పనిచేయడమే అందుకు కారణం. బాలకార్మికులు ఉత్పత్తి చేసే ఏ వస్తువునూ దిగుమతి చేసుకోరాదన్నది అమెరికా నిర్ణయం. బాలకార్మికులను ప్రోత్సాహించకూడదు అన్నది దానిఉద్దేశం. చదువుకోవలసిన ప్రాయంలో పసిపిల్లలు-బీడీలు, బాణాసంచా, గాజులు దుప్పట్లు మొదలైనవాటిని తయారుచేసేచోట్లా; బరువులు మోస్తూ, హోటళ్ళలో సర్వర్లుగా క్లీనర్లుగా తమ భవిష్యత్తును బుగ్గి పాలు చేసుకోవలసి రావడం శోచనీయం!





## 'మౌస్ క్లిక్'తో పంచతంత్ర కథలు

పంచతంత్ర కథలలో ఎలుకలు కూడా ప్రధాన పాత్ర వహిస్తాయి. ఇప్పుడు కంప్యూటర్ 'మౌస్'ను క్లిక్‌చేసి పంచతంత్ర కథలన్నిటినీ చదువుకునేరోజులు త్వరలో రానున్నాయి.పూనే విశ్వవిద్యాలయ సైన్స్ విభాగం వారు దీనికి కావలసిన 'సాఫ్ట్‌వేర్'ను రూపొందించారు. పంచతంత్రకథలు, కథాసరిత్సాగరంతో పాటు సంస్కృత సాహిత్యంలోని సామెతలు, సుభాషితాలు మొదలైనవాటితో 'శాన్స్‌క్రిట్ ఇన్ఫర్మేటిక్స్ (సంస్కృత సమాచార సర్వస్వం) అనే ప్రణాళికను రూపొందించారు. కాన్పూరు, హైదరాబాద్ ఐ. ఐ.టి, బెంగుళూరు సి.డాక్ నిపుణులు ఈ సాఫ్ట్‌వేర్‌ను సిద్ధంచేయడానికి సహకరించారు.

కథకు సరైన ముగింపు రాయండి! చక్కని బహుమతి గెలుచుకోండి!

# సృజనాత్మక పోటీ!

*ఒక చిన్నకథ తొలిభాగం దిగువఇవ్వబడింది. ఆసక్తి కరమైన కథగా రూపొందే అంశాలన్నీ అందులో ఉన్నాయి. అయితే, దాన్ని రసవత్తరంగా మలిచే శక్తి మీ చేతుల్లోనే ఉంది. సరైన ముగింపుతో, మిగిలిన కథను రాయండి. కథకు తగిన పేరు పెట్టండి. మీ రచన 200 పదాలకు మించకుండా ఉండాలి. ఉత్తమమైన ముగింపుకు ఆకర్షణీయమైన బహుమతి ఇవ్వబడుతుంది. ఈ పోటీ మన యువపాఠకుల కోసమే నిర్దేశించబడింది. మీ పేరు, వయసు, చదివే తరగతి, పాఠశాల, పిన్‌కోడ్‌తో సహా మీ ఇంటి చిరునామా రాయడం మరిచిపోకండి. పెద్దలకన్నా మీరే చక్కగా రాయగలరని నిరూపించడానికి ఇదొక అరుదైన అవకాశం. అందువల్ల పెద్దల సాయం తీసుకోకండి. ఇక కథను చూద్దాం:*

ఒకానొక గురుకులంలో విద్యార్థులు కొందరు విద్యాభ్యాసం పూర్తిచేసి స్వస్థలాలకు తిరిగి వెళ్ళడానికి సిద్ధమయ్యారు. వెళ్ళేముందు ఒక్కొక్కరుగా గురువుగారి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేయసాగారు. గురువుగారి ప్రియశిష్యుడైన రవిచంద్రుడు చివరగా గురువు పాదాలకు నమస్కరించాడు. విద్యాభ్యాసం పూర్తయ్యాక జరిగిన పరీక్షలలో, రవిచంద్రుడు ఎప్పటిలా కాకుండా కొంత వెనకబడ్డాడు. అది గురువుకు కొంత విచారం కలిగించింది. ''నాకు ఏం చెప్పాలో తోచడం లేదు నాయనా! పలువిషయాల్లో నువ్వు మిగిలిన వారికన్నా శ్రేష్ఠుడివిగా ఉన్నావు. అయినా నిన్ను మంచి పండితుణ్ణి చేయలేక పోయాను,'' అన్నాడు గురువు.

రవిచంద్రుడు లేచి కొంతసేపు తల వంచుకుని మౌనంగా నిలబడ్డాడు. ఆ తరవాత, ''క్షమించండి గురుదేవా! తమరు నా పట్ల కనబరచిన అపారకరుణకు సర్వదా కృతజ్ఞుణ్ణి!'' అన్నాడు.

గురువు మందహాసం చేస్తూ, ''ఫరవాలేదు, నాయనా! ఇప్పటికీ మునిగిపోయిందేమీ లేదు. నేను నీకు మూడు ముఖ్యమైన సూత్రాలు చెబుతాను: ఒకటి, జీవితంలో లక్ష్యాన్ని సాధించేంత వరకు ప్రయత్నం మానకూడదు. రెండు, చాలినన్ని ప్రశ్నలు అడగగలిగితే సమాధానాలు వాటంతట అవే వస్తాయి. మూడు, ఒకటికి రెండుసార్లు ఆలోచించి ఏపనైనా తలపెట్టినట్టయితే, పొరబాట్లు జరగవు. ఈ మూడు సూత్రాలనూ పాటించి నట్టయితే, నువ్వు జీవితంలో తప్పక విజయం సాధిస్తావు. విజయోస్తు! వెళ్ళిరా,'' అని ఆశీర్వదించాడు.

రవిచంద్రుడు గురువుగారి మూడు సూత్రాలను శిరసావహించి, వాటిని ఆచరణలో పెట్టడానికి కృతనిశ్చయంతో బయలుదేరాడు.

*అతడు జీవితంలో విజయం సాధించాడా? అలా అయితే ఆ మూడు సూత్రాలను అతడు ఎలా ఉపయోగించుకున్నాడు. ఈ కథ రెండవ భాగం రాయండి. సరైన పేరుపెట్టడం మరిచిపోకండి. ఆగస్టు 25వ తేదీలోగా మాకు అందేలా పంపండి. గెలుపొందిన రచనను అక్టోబర్ నెల సంచికలో ప్రచురిస్తాం. —సంపాదకుడు*

## జూలై 2000 భారతదర్శనం క్విజ్ సమాధానాలు

1. ఎ. వర్ధమాన మహావీరుడు, గౌతమ బుద్ధుడు. ఇద్దరూ రాజకుటుంబాలకు చెందినవారే.
   బి. పాళీ భాషలో.
   సి. త్రిపిటక.
   డి. అర్ధ – మాగధి.
   ఇ. పూర్వ, అంగ, మూలసూత్ర.
2. ఉజ్జయినీ రాజు భర్తృహరి. పింగళాదేవి.




# మహోన్నతుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఒక దేశాన్నేలే రాజుగా నువ్వు ఎందరో మహాపండితుల్నీ, శాస్త్ర జ్ఞానంలో నిధులైన వారినీ ఎరిగివుంటావు. ఐతే, వారిలో ఏ ఇద్దరూ ఏది ధర్మం, ఏది జ్ఞానం అన్న విషయాల్లో ఏకీభవించడం చాలా అరుదు. అలాంటి సందర్భాలలో రాజులు, ఎక్కువ వాదనాపటిమ వున్న వాడి అభిప్రాయాల



తోనో, లేక తన ఆలోచనా సరళికి అనుకూలంగా మాట్లాడిన వాడితోనో ఏకీభవించి రాచ కార్యాలు నిర్వహించ చూస్తారు. ఇందువల్ల రాజ్యంలో ఒక్కొక్కసారి అనర్థాలూ, విచక్షణా జ్ఞానహీనులూ ప్రముఖులయి, పరిపాలనా వ్యవస్థ కుంటుపడే ప్రమాదం వున్నది. ఇందుకు ఉదాహరణగా విశ్వనాధుడనే పండితుడూ, నయసాగరుడనే రాజుకథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం భువనగిరి అనే రాజ్యంలో, విశ్వనాధుడనే పండితుడు, ఒక గురుకులం నడుపుతూండేవాడు. దూరప్రాంతాలనుంచి విద్యార్థులు అక్కడికి వచ్చి విద్య నభ్యసించేవారు. ఆయన తర్కవ్యాకరణ శాస్త్రాల్లో సాటిలేని మహాపండితుడని చెప్పుకునేవారు.

ఒకనాడు, ఆయన శిష్యులకు తర్క శాస్త్రం బోధిస్తూండగా, రాజునయసాగరుడు పంపిన దూత వచ్చి, లేఖ ఒకటి ఆయనకు ఇచ్చాడు. అందులో విశ్వనాధుణ్ణి రాజధానికి రావలసిందిగా రాజు పంపిన ఆహ్వాన పత్రం వున్నది. మర్నాడు, విశ్వనాధుడు, కనకశర్మ అనే శిష్యుణ్ణి వెంటబెట్టుకుని, సాయంకాలానికి కాశీపురం అనే గ్రామం చేరి, రాత్రికి ఒక సత్రంలో విడిదిచేశాడు. ఆ సమయంలో సత్రంలో చెప్పుకుంటున్న విశేషాలువిని, ఆశ్చర్యపోతూ గురువుకు విన్నవించాడు, కనకశర్మ.

మర్నాడు, సూర్యోదయంతోనే గురుశిష్యులు గ్రామం వెలుపల వున్న చెరువు దగ్గరకు వెళ్ళారు. ఆ రోజు శ్రావణ పూర్ణిమ. అప్పటికే అక్కడ జనంగుంపులు గూడి వున్నారు. ప్రతి సంవత్సరం శ్రావణ పూర్ణిమ నాడు హఠయోగి విమలానంద స్వామి సూర్యోదయకాలంలో దర్శన మిస్తాడు. అందరి దృష్టీ చెరువు మధ్యలో వున్న చిన్న ఇసుకదిబ్బ పైనే వున్నది.

స్వామి విమలానందుడు హఠాత్తుగా, ఇసుకదిబ్బ పక్కనున్న నీళ్ళలో నుంచి పైకి లేచాడు. భక్తులకోలాహలం మిన్నుముట్టింది. భక్తిపారవశ్యంతో స్వామికి జేజేలు పలికారు.

విమలానందుడు నీళ్ళ మీద నడుచుకుంటూ తీరం వైపు రాసాగాడు. ఆయన నేలపై నడిచినట్టుగానే, నీటిమీద నడిచివచ్చి, చెరువుగట్టుపైన ఆలయం ముందున్న వేదిక మీదికి ఎక్కికూర్చున్నాడు. విమలానందుడు ప్రతి సంవత్సరం ఒక్కసారి మాత్రమే నీటి పైకి వచ్చి భక్తులకు దర్శనమిస్తాడు. ఆ హఠయోగి దర్శనంతో, తన జన్మ తరించినట్టు కనకశర్మ ఉప్పొంగిపోయాడు.

ఆ తరవాత, గురుశిష్యులిద్దరూ బయలు దేరి, అరణ్యమార్గాన పయనించి, సూర్యాస్తమయ సమయాన ఒక ముని ఆశ్రమం చేరారు. ఆశ్రమం శరభంగుడనే మహాతపస్విది. ఆశ్రమం ముందు హోమగుండాలు నిర్విరామంగా ప్రకాశిస్తున్నవి. మరుసటి రోజు సూర్యోదయ వేళలో ముని హోమ గుండంలో ప్రవేశిస్తాడని, ఆయన శిష్యులు చెప్పారు. అందువల్ల ఆ రాత్రంతా హోమ గుండాలు ప్రజ్వరిల్లుతూనే వుంటాయి.

సూర్యోదయం వేళ, మంత్రద్రష్ట అయిన ఆ మహాముని, అగ్నిహోత్రాన్ని ప్రజ్వరిల్ల జేసి, అగ్నిప్రవేశం చేశాడు. ఆశ్రమవాసులు భయాందోళనలతో చూడసాగారు. అరగంట తరవాత ముని అగ్నికుండం నుంచి మేలిమి బంగారు ఛాయలో ధగధగ మెరిసిపోతూ బయటికి వచ్చాడు.

ఆశ్రమవాసులూ, ఈ అద్భుత దృశ్యాన్ని చూడవచ్చిన భక్తులూ హర్ష ధ్వానాలుచేశారు. మునిచేతులెత్తి, వారందరినీఒకసారిదీవించి, ఆశ్రమంలోకి వెళ్ళిపోయాడు. కనకశర్మ పరమానందభరితుడై, తన జీవితం ధన్యమైనట్టు భావించాడు.

మరుసటిరోజున విశ్వనాథుడూ, కనక శర్మా అక్కడినుంచి బయలుదేరి కొండలూ, గుట్టల మార్గం గుండా ప్రయాణం చేసి, మధ్యాహ్నం వేళకు రాయదుర్గం అనే గ్రామం చేరారు. అంతంత మాత్రంగా పంటలుపండే ఆ మెట్ట ప్రాంతం, ఆ సంవత్సరం వర్షాలు లేక కరువు కాటకాలతో అల్లాడిపోతున్నది. తాగేందుకు నీరు కూడా దొరకక ప్రజలు ఆకలి చావులకు గురవుతున్నారు.




రాయదుర్గ గ్రామంలో, రమేశుడనే రైతు యువకుడొకడున్నాడు. వాడు తన గ్రామ యువకులనే కాక, కరువు ప్రాంతాలవున్న యువకుల్ని కూడా సమీకరించి, పంటలు సమృద్ధిగా వున్న ప్రాంతాలనుంచీ, సమీప పట్టణాలనుంచీ దాతల ద్వారా తిండి గింజలు సేకరించి, గంజి కేంద్రాలు స్థాపించి అన్నార్తులను ఆదుకుంటున్నాడు.

గురుశిష్యులిద్దరూ గ్రామం చేరాక, వాళ్ళ ఎదుట దయనీయమైన సంఘటన ఒకటి జరిగింది. చేతికర్రసాయంతో, దూర ప్రాంతం నుంచి గంజికేంద్రానికి వచ్చిన ఒక వృద్ధురాలు, రమేశుడు గంజివున్న పాత్రతో వచ్చే లోపలే, ఆకలిని భరించలేక కుడితి తొట్టెలో వున్న బియ్యంకడుగును దోసిలితో తాగి స్పృహ తప్పిపడిపోయింది.



రమేశుడామెను పొదివి పట్టుకుని గంజి తాగించాలని చూశాడు. కాని, అప్పటికే ఆ వృద్ధురాలు ప్రాణాలుకోల్పోయింది.

ఈ దుర్ఘటన రమేశుడికి కళ్ళనీళ్ళు తెప్పించింది. చుట్టూ వున్న ప్రజలు మరణించిన వృద్ధురాలికేసి చూస్తూబాధతో తలలు వంచుకున్నారు.

కొద్దిదూరంలో నిలబడి, ఈ జరిగినదంతా చూసిన విశ్వనాధుడు, రమేశుణ్ణి సమీపించి, ''మీరు ఇక్కడి కరువు పరిస్థితులు ఎంత భయానకంగా వున్నదో వివరిస్తూ, మహారాజు నుంచి సహాయం కోరితే ఎంతో బావుండేది గదా!'' అన్నాడు.

రమేశుడు, విశ్వనాధుడికి నమస్కరించి, ''స్వామీ, సహాయంకోసం రాజుగారిని అర్థించడం జరిగింది. కాని, మాకెలాంటి సహాయమూ అందలేదు. ఇంత పెద్ద రాజ్యంలో, ఏదో ఒక ప్రాంతాన కరువు కాటకాలన్నవి అసహజమేం కాదనుకుని వుంటాడాయన!'' అన్నాడు.

రమేశుడి మాటల్లోని వ్యంగ్య విమర్శను గుర్తించిన విశ్వనాధుడు, మరేం మాట్లాడకుండా, అక్కడినుంచి కదిలి రాజధానికి చేరాడు.

రాజధానిలో, విశ్వనాధుడికి, రాజు నయసాగరుడు ఘనంగా స్వాగత సత్కారాలు జరిపాడు. తరవాత, పురప్రముఖులతో సభ ఏర్పాటు చేయబడింది. సభలో విశ్వనాధుడు తన ప్రయాణంలో చూసిన ముఖ్య సంఘటనలను రాజుకు వివరించాడు.

అంతా శ్రద్ధగా విన్నరాజు, ''మనరాజ్యంలో ఎందరో మహోన్నత వ్యక్తులున్నట్టు కనబడుతున్నది. రాజోద్యోగుల ద్వారా, ఇతరత్రా నేను సేకరించిన మరికొందరి పేర్లు తమకు యిస్తున్నాను,'' అంటూ, విశ్వనాధుడికి కొన్ని పత్రాలు ఇచ్చి, ''ఒక మారు తమరు ఇవన్నీ కూడా నిశితంగా పరీక్షించి, ఈ సంవత్సరం మనం ఇవ్వదలచిన ప్రతిష్ఠాత్మకమైన మహోన్నత వ్యక్తిని నిర్ణయించండి!'' అన్నాడు.

విశ్వనాధుడు, రాజు ఇచ్చిన పత్రాలన్నీ చదివి, ''మహారాజా! కరువుకాటకాలతో తల్లడిల్లుతున్న రాయదుర్గం ప్రాంతాలకు, ఆహార ధాన్యాలను తక్షణం తరలించండి. దానితో పాటు అవసరమైన ఇతర సహాయ సహకారాలను కూడా అందించండి. ఈ సంవత్సరం మన రాజ్యంలో మహోన్నత వ్యక్తిగా, రాయదుర్గం వాడైన రమేశుణ్ణి నిర్ణయిస్తున్నాను!'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ప్రజలు చెప్పుకుంటున్నట్టు, రాజు నయసాగరుడు విశ్వసిస్తున్నట్టు, ఈ విశ్వనాథుడు తర్క వ్యాకరణాల్లో మహాపండితుడా, లేక వితండ వాద శిరోమణా అన్న అనుమానం కలుగుతున్నది. హఠ యోగి విమలా నందస్వామి నిండు సంవత్సరం పాటు నీటి అడుగున వుండి, తరవాత పైకిలేచి, నీటిమీద నడవడం ఆయన చూశాడు. అలాగే, మహోజ్వలంగా మంటలు వెదజల్లుతున్న హోమగుండంలో దిగి, అరగంట తరవాత మేలిమి బంగారు ఛాయతో బయటికి వచ్చిన, మహా మంత్ర ద్రష్ట శరభంగమునిని చూశాడు. అయినా అంత మహోన్నతులను కాదని, విశ్వనాథుడు కరువు కాటకాల్లో చిక్కిన ప్రజలకు గంజి కేంద్రాలునడిపే సామాన్యరైతు యువకుడైన రమేశుణ్ణి, మహోన్నతుడుగా నిర్ణయించడాన్ని ఏమనాలి? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''విమలానంద స్వామి హఠయోగి. ఎంతోకాలం సాధనచేసి జలస్తంభన విద్య సాధించాడు. ఏడాది కొకసారి నీటిపైకి వచ్చి, తనవిద్యను ప్రదర్శించి భక్తుల చేత పొగడ్తలు పొందుతున్నాడు. ఇందువల్ల అతడికి మహదానందం కలగవచ్చు. కాని, ప్రజలకు జరిగిన మేలేమిటి? ముని శరభంగుడు మంత్రశాస్త్రంలో నిధి కావచ్చు. అందువల్ల, ఆయన మంటల్లో అరగంట కాలం గడిపి సజీవంగా బయటికి రాగలుగుతున్నాడు. ఇది ఆయనకు ఆత్మ తృప్తి నివ్వవచ్చు. అయితే, ఈ ప్రదర్శనవల్ల ప్రజలకు రవ్వంతయినా మేలు జరుగుతున్నదా? రమేశుడు యోగి, మునుల్లా తమ తమ స్వార్థచింతనా, కీర్తిప్రతిష్ఠల్లో మునిగి తేలక, కరువుకాటకాల్లో మలమలమాడుతూన్న ప్రజలకు చేతనైనంతలో సహాయం చేస్తూ ఆదుకుంటున్నాడు. ఆకారణంవల్లనే విశ్వ నాథుడుఅతణ్ణి మహోన్నతుడుగా నిర్ణయించాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు —(కల్పితం)

[ఆధారం:వల్లమేటి సుందరరామయ్య రచన]





# రూపాయి సమస్య

నిరంజనవరంలో, వారానికి ఒకమారు సంత జరుగుతుంది. సమీప గ్రామాల్లోని ఎంతో మంది ప్రజలు, తమ అవసరాల నిమిత్తం సంతరోజు నిరంజనవరం వస్తూంటారు.

శేషాచలం అనే అతడిది నిరంజనవరంలో వెచ్చాల అంగడి. ఆయన అంగడికి ప్రతి వారం ఆనవాయితీగా వీరభద్రం అనే సంపన్నుడు వచ్చి, తనకు అవసరమైన వెచ్చాలు కొనుక్కుని వెళుతూండేవాడు. అతడికి శేషాచలం మీద గట్టినమ్మకం.

ఒకసారి వీరభద్రం వెచ్చాలు కొనుక్కున్న తరవాత, డబ్బు చెల్లించబోతే ఒక్కరూపాయి తక్కువ అయింది. ఆయన, శేషాచలంతో, ''మళ్ళీ వచ్చేవారం సంతకు వచ్చినప్పుడు ఆ రూపాయి యిస్తాను. నాకు కాస్త మతిమరుపు. ఒకవేళ నేను మరిచినా నువ్వు గుర్తుపెట్టుకుని, ఆ రూపాయి అడిగి తీసుకో,'' అన్నాడు.

శేషాచలం సమర్థుడైన వ్యాపారి కావడం వల్ల చాలా నిక్కచ్చిమనిషే కాక నిర్మొహమాటస్తుడు. మరుసటివారం వీరభద్రం వచ్చినప్పుడు, గుర్తుచేసి రూపాయి తీసుకున్నాడు.

రెండు మూడు వారాలు గడిచాయి. ఆ తరవాత ఒకసారి వీరభద్రం వచ్చి, వెచ్చాలు కొనుక్కుని డబ్బులు ఇచ్చి వెళుతుండగా, శేషాచలం వినయంగా, "అయ్యా, మీ నుంచి నాకు ఒక్క రూపాయి రావలసివుంది,'' అన్నాడు.

వీరభద్రం ఒక్కక్షణం ఆశ్చర్యపోయి, కొంచెంసేపు తరవాత, రూపాయి శేషాచలానికిచ్చాడు.

తిరిగి రెండు మూడు వారాలు గడిచాక శేషాచలం, వీరభద్రాన్ని మళ్ళీ రూపాయి అడిగాడు. ఈసారి వీరభద్రం ఏదో సంశయిస్తున్న వాడిలా తలాడించి, మారు మాట్లాడకుండా శేషాచలానికి రూపాయి ఇచ్చేశాడు.

ఆ తరవాత కూడా అదే వరస. చాలా సార్లు శేషాచలం, వీరభద్రం దగ్గర రూపాయి అడిగి తీసుకున్నాడు. వీరభద్రం కూడా శేషా

దాసరి వెంకటరమణ

చలం అడిగిన ప్రతిసారీ రూపాయి ఇస్తూ పోయాడు.

వీరభద్రం ఇక ఓర్చుకోలేక ఒకనాడు తనను రూపాయి అడిగిన శేషాచలంతో, "నీకు ఎన్నిసార్లు రూపాయి ఇవ్వాలయ్యా?" అన్నాడు కోపంగా.

శేషాచలం కొద్దిసేపాగి, వీరభద్రం కాస్త శాంత పడ్డాక, తాపీగా, "మీరు మాత్రం నేన డిగిన ప్రతిసారీ రూపాయి ఎందుకిస్తున్నారు?" అన్నాడు.

వీరభద్రం, శేషాచలం ముఖంలోకి చూస్తూ చిరునవ్వునవ్వి, "నిజం చెప్పమంటావా?" అని అడిగాడు.

శేషాచలం చెప్పమన్నట్టు మెల్లగా తలూపాడు.

వీరభద్రం ఒకసారి గొంతు సవరించుకుని, "మొదటిసారి నేను రూపాయి ఇచ్చిన తరవాత, నువ్వు మళ్ళీ అడిగినప్పుడు, ఇద్దామనుకుని మతిమరుపుకొద్దీ ఇవ్వలేదేమో అని, రెండవసారి రూపాయి ఇచ్చాను. ఆ తరవాత మళ్ళీ నువ్వు రూపాయి అడిగినప్పుడు, రూపాయి నీకిచ్చి నట్టుగా నాకు బాగా గుర్తుంది. కానీ నువ్వు పనివత్తిడిలో పడి, జ్ఞాపకం లేక అడుగుతున్నావేమో, రూపాయే కదా పోనీ అని ఇచ్చాను. ఆ తర్వాత నువ్వు మళ్ళీ రూపాయి అడిగినప్పుడు, నీమీద జాలి కలిగింది. ఈ మనిషికి ఇంత మతిమరుపైతే, వ్యాపారం ఎలా చేసుకుంటున్నాడో అనిపించింది. ఎన్నిసార్లు రూపాయి అడిగితీసుకుంటావు? అని నిర్మొహమాటంగా చెప్పాలనిపించింది. అయినా, చెప్పలేకపోయాను. నువ్వు ఎన్నిసార్లు ఇలా రూపాయి తీసుకుంటావో చూడాలన్న, కుతూహలం కొద్దీ ఇస్తూ వచ్చాను," అన్నాడు.





రహస్యంగా దానం చేయడం; ఇంటికి వచ్చిన వారిని ఆదరించడం; ఇతరులు తమకు చేసిన మేలును పదిమందికీ చెప్పుకోవడం; సంపదలు కలిగినప్పుడు గర్వం లేకుండా ఉండడం; పరులను నిందించకుండా ఉండడం- మంచివారి సహజ గుణాలు

-భర్తృహరి

శేషాచలం చిరునవ్వు నవ్వి, ''మీ మనసు నొప్పించివుంటే మన్నించండి! నిజానికి మీరు మొదట నా అప్పు రూపాయి చెల్లించింది మరిచిపోయి, రెండోసారి అడిగాను. మీరు రూపాయి ఇచ్చి అటు వెళ్ళగానే, మీ ముఖంలో మెరిసిన ఆశ్చర్యం చూసిన నాకు, మీరు ఇదివరకే రూపాయి ఇచ్చినట్టు గుర్తుకు వచ్చింది. మీరు మళ్ళీ అంగడికి వచ్చినప్పుడు రూపాయి ఇచ్చేద్దామనుకున్నాను. కానీ తీరా మీరువచ్చేసరికి, మీరు ఏమంటారో చూద్దామని, సరదాగా ఏమీ ఎరగనట్లు గంభీరంగా రూపాయి బాకీ గురించి అడిగాను. మీరు రవ్వంత ఆశ్చర్యపడినా, మారు మాట్లాడకుండా రూపాయి ఇవ్వడం చాలా విచిత్రం అనిపించింది. చూద్దాం, మీరిలా రూపాయి ఎన్నిసార్లిస్తారో అనుకున్నాను. నేను అడిగిందే తడవుగా మీరిస్తూ పోయారు. మీ రూపాయలు ఎక్కడికీ పోలేదు, భద్రంగా మూట గట్టి పెట్టాను,'' అంటూ లోపలికి వెళ్ళి, కొంతసేపయ్యాక ఒక చిన్న మూట తీసుకు వచ్చి, వీరభద్రానికి ఇస్తూ, ''చూడండి, మీతో వున్న చనువును బట్టి చెబుతున్నాను, మనిషికి మొహమాటం వుండకూడదు. అవతలి వ్యక్తితో స్నేహం చెడుతుందని, మన వ్యక్తిత్వం చంపుకోకూడదు. నిక్కచ్చిగావుండాలి. మీరు, రూపాయే కదా అని నిర్లక్ష్యం చేశారు. బంధువైనా, స్నేహితుడైనా లావాదేవీలు సరికొల్చుకున్నట్లు వుంటేనే, బంధం చెక్కు చెదరకుండా కలకాలం నిలుస్తుంది!'' అన్నాడు.

శేషాచలం మాటలకు వీరభద్రం అబ్బురపడి, అతణ్ణి ఎంతగానో అభినందిస్తూ, ''నీ వంటి ఉత్తమ వ్యక్తి నాకు స్నేహితుడుగా లభించినందుకు చాలా ఆనందంగా వుంది!'' అన్నాడు.





# గారడీ వాడి కోరిక

హేలాపురి జమీందారు అచ్యుతరాయలు చాలా దయాగుణం కలవాడు. ఆ చుట్టు పక్కల గ్రామాల ప్రజలు ఆయనను ఒక దేవుడుగా భావించి గౌరవిస్తూంటారు. అయితే, ఆయన కీర్తి ప్రతిష్ఠలు చూసి ఓర్వలేని కొందరు, ఆయనను ఏదో విధంగా అప్రతిష్ఠ పాలు చేయాలని ప్రయత్నిస్తుండేవారు.

ఒకనాడు అచ్యుతరాయలు, సుగంధ పురి నుంచి వచ్చిన ఊరిపెద్దలతో ఊరి బాగోగుల గురించి ముచ్చటిస్తున్న సమయంలో, ఒక గారడీవాడు అక్కడికి వచ్చాడు. వాడు జమీందారుకు నమస్కరించి, "ప్రభూ! తమరి సమక్షంలో నా గారడీవిద్యను ప్రదర్శించి, తమరిని ఆనంద పరచడానికి అనుమతి వేడుకుంటున్నాను," అన్నాడు. "తప్పకుండా నీ విద్యను ప్రదర్శించడానికి, అనుమతిస్తున్నాను," అన్నాడు జమీందారు చిరునవ్వుతో.

"చాలా కృతజ్ఞుణ్ణి, ప్రభూ!" అని గారడీ వాడు తనవిద్య ప్రదర్శించడం ప్రారంభించాడు.

వాడు అనేక చిత్రవిచిత్రమైన పరికరాలతో, అద్భుతంగా తన గారడీవిద్యను, ఒక గంట కాలం ప్రదర్శించాడు. ఆ అద్భుత విద్యలన్నీ చూసి సభలోవున్న వాళ్ళందరూ ఆనంద పరవశులై చప్పట్లతో వాణ్ణి మెచ్చుకున్నారు. ప్రదర్శన ముగిసినఅనంతరం, అచ్యుతరాయలు, గారడీవాణ్ణి ఏం కావాలో కోరుకోమన్నాడు.

"నాకోరిక చెప్పిన తర్వాత, మాట తప్పకూడదు, ప్రభూ!" అన్నాడు గారడీవాడు.

"అలాంటి అనుమానం పెట్టుకోకుండా ఏం కావాలో కోరుకో, మాటతప్పను," అన్నాడు జమీందారు.

కోనే నాగ వెంకట ఆంజనేయులు

"ప్రభూ! తమరిని తలపైజుట్టు, మూతి మీద మీసాలులేకుండా చూడాలనికోరికగా వున్నదిఅనుగ్రహించండి!" అన్నాడుగారడీవాడు.

ఈ వింతకోరికకు సభలోని వారందరూ నిర్ఘాంతపోయారు. జమీందారు కూడా నిశ్చేష్టుడైకొద్దిక్షణాలపాటుఅలావుండిపోయాడు. ఇది తనంటే గిట్టనివాళ్ళు చేసిన కుట్ర అని ఆయన గ్రహించాడు.

పొడవైన ఉంగరాలజుట్టు నిమ్మకాయలు నిలబెట్టగలిగే తన కోరమీసాలు, జమీందారుకు ఎంతో ప్రీతిపాత్రమైనవి. అవి తీసివేసి గారడీవాడికి కనిపించి, అందరిలోనూ అవమానంపాలు కావలసిందేనా?

జమీందారు ఏంచేయాలో పాలుపోక, "ఒరే, నీకు మరొక అవకాశం ఇస్తున్నాను. ఈ కోరిక తప్ప మరేదైనా కోరిక కోరుకో," అన్నాడు.

"నాఈ చిన్న కోరిక మాత్రం తీర్చండి, ప్రభూ! అంతేచాలు," అన్నాడు గారడీవాడు.

ఒకటి, రెండు క్షణాలు గడిచాక జమీందారు మౌనం చూసి గారడీవాడు, "ఆడినమాట తప్పి,అప్రతిష్ఠపాలు కాకండి, ప్రభూ!" అన్నాడు హెచ్చరిస్తున్నట్టు.

ఇదంతా గమనిస్తున్న జమీందారుగారి ప్రధాన సలహాదారుడు విష్ణుశర్మ, చప్పున ఆసనంలో నుంచిలేచి, గారడీవాడికేసి చేయి వూపుతూ, "ఒరే, నా వెంటరా!" అన్నాడు.

గారడీవాడు విష్ణుశర్మ వెనక నడిచాడు. ఆయన, వాణ్ణి దేవిడీలోకి తీసుకుపోయి, పది నిమిషాల తరవాత సభలోకి తీసుకువచ్చాడు.

ఇప్పుడా గారడీవాడి తలపైజుట్టు, మూతి మీద మీసాలు లేవు.

విష్ణుశర్మ వాడితో, "ఒరే, నువ్వుకోరుకున్న విధంగానే తలపైజుట్టు, మూతిమీదమీసాలు లేకుండా, జమీందారుగారిని చూడు!" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

వాణ్ణి చూసి సభలోని వారందరూ పెద్దగా నవ్వారు. జమీందారు హాయిగా ఊపిరి పీల్చుకుని, తనను రానున్నఅవమానం నుంచి కాపాడినందుకు, విష్ణుశర్మను ఎంతగానో ప్రశంసించాడు.





# స్వర్ణసింహాసనం

**9**

[ కౌండిన్య దేశపు యువరాజు విజయదత్తుడు, పట్టాభిషేకానికి సంసిద్ధుడై, స్వర్ణసింహాసనం తొలిమెట్టు మీద కాలుమోపగానే సాలభంజిక సత్యశక్తి, అతని సూక్ష్మబుద్ధిని పరీక్షించడానికి ఒక కథ చెప్పి, దానికి సంబంధించిన ప్రశ్న అడిగింది. యువరాజు దానికి సరైన సమాధానం చెప్పాడు. రెండవ మెట్టుమీది ధర్మసాలభంజిక, సువర్ణగిరి యువరాజు మలయధ్వజుడు రాజద్రోహులను తుదముట్టించిన కథ చెప్పి, తనకు సాయమందించిన పౌరులను అతడు సత్కరించిన విధానం గురించి ప్రశ్నించింది. విజయదత్తుడు దానికీ సరైన సమాధానం చెప్పాడు. మూడవ మెట్టుమీది న్యాయసాలభంజిక, న్యాయవర్ధన మహారాజు కథ చెప్పడం ప్రారంభించింది. -తరవాత]

**చ**ంద్రన్న వినయంగా, మహారాజుకు నమస్కరించి, ''మహారాజా! వీరనందుడు చెప్పినవి చాలా వరకు నిజాలే. అయితే, అతడు నిజాలకు తన అభిప్రాయాలన్నింటినీ జోడించి చెప్పటం వల్ల, జరిగినది చాలా దారుణ మన్న అభిప్రాయం, ఎవరికైనా సరే కలగకమానదు. కాని, అసలు విషయం పూర్తిగా వేరు.

''వీరనందుడూ, నేనూ చిన్నతనం నుంచి స్నేహితులమే! వియ్యంకులమవుదామనుకున్న మాటా సత్యమే! అయితే, మేం మాట తప్పటానికి కారణం మా రెండు కుటుంబాల తాలూకు జీవన విధానాల్లో వున్న పెద్ద తేడాయే గాని, డబ్బుమాత్రం కాదు. నేనూ వీరనందుడూ ఇంచుమించుగా ఒక లాంటి వాళ్ళమే. మా జీవితాల్లో మార్పు వచ్చింది, కేవలం మా భార్యల వల్ల మాత్రమే!

''నా భార్య జానకి చాలా ఒద్దికైన మనిషి, కష్టజీవి! నేను రూపాయి సంపాదించి తెస్తే, అందులో సగం దాచి, మిగతా సగంతోనే పొందిగ్గా సంసారం నడిపేది. అప్పడాలు చేసీ,

లక్ష్మీ గాయత్రి



కలవారి ఇళ్ళల్లో పనుల్లో సాయం చేసీ, బుట్టలు అమ్మీ, తనూ పావలా అర్ధా సంపాదిద్దామని తాపత్రయపడేది. ఆ డబ్బును తక్కువ వడ్డీలకు అప్పులిచ్చేది. అలా నా భార్య సమర్థత వల్లే, మేం ఈనాడు ఇలా వున్నాం. నా భార్యదగ్గరే నేను కష్టపడడం నేర్చుకున్నాను. మేమిద్దరం కలిసి, మా ఒక్కగానొక్క బిడ్డకు కష్టపడి పనిచేయటం నేర్పాం. మా ఇంట్లో మేంముగ్గురం శ్రమిస్తాం. మా శ్రమఫలాన్ని అభివృద్ధి చేస్తాం. ఇదీ మా జీవితం!

"నా భార్యకు పూర్తి వ్యతిరేకమైన మనిషి, వీరనందుడిభార్య కనకం. ఆవిడకు నిలువెల్లా బద్ధకమే. భర్తకూ, పిల్లలకూ ఇంత ఉడకేసి పెట్టటం కూడా, ఆమెకు విసుగే. ఆ విసుగుతో, సోలెడు జాగాలో , తప్పెడు ఉడకేసి పారబోసేది. డబ్బు లేనప్పుడు, తేలేదని భర్తను సాధించటం ఒక్కటే ఆమెకు తెలిసిన విద్య. నేను, నాభార్య దగ్గరనుంచి కష్టపడటం నేర్చుకుంటే, వీరనందుడు, తన భార్య కనకం దగ్గరనుంచి బద్ధకించటం, తనలో తప్పులు పెట్టుకుని మరొకళ్ళను తిట్టి పొయ్యటం నేర్చుకున్నాడు. వాళ్ళ పిల్లలకు కూడా ఆ బుద్ధులే అబ్బాయి.

"మొదట్లోమేంపెద్దగా పట్టించుకోలేదు. కులపెద్దల ముందు సంబంధం అనుకున్నాక, మాకు కాబోయే అల్లుడు సారంగుణ్ణి కూడా మాలో కలుపుకుని పనీపాటా మప్పుదామని నా భార్య శతవిధాల ప్రయత్నించింది. కాని, వాడు ససేమిరా లొంగేవాడు కాదు. వాణ్ణి పల్లెత్తుమాట అన్నాసరే, కనకానికి ఊరంత కోపం వచ్చేది. మేం డబ్బు కక్కుర్తితో పిల్లాణ్ణి రాచిరంపాన పెట్టాలని చూస్తున్నామంటూ తిట్టేది. ఇలా మొన్న మొన్నటి వరకూ జరిగింది. ఎప్పటికైనా వాళ్ళలో మార్పు వస్తుందేమోనని చూసి చూసి విసుగెత్తిపోయి చివరకు తెగించి పిల్లనివ్వమని చెప్పేశాం!

"సారంగుడు ప్రస్తుతం పదిహేడేళ్ళ కుర్రవాడు. మా లక్ష్మి పదిహేనేళ్ళది. మా పిల్ల చేసే కాయకష్టంలో, నూరోవంతు కూడా వాడు చెయ్యడు సరికదా, ఈ మధ్య ఊరి చివరి గంగరావి చెట్టు కిందకూర్చుని కల్లు తాగుతూ, జూదం ఆడటం కూడా నేర్చుకున్నాడు. అటువంటి వాడికి, రత్నంలాంటి నా కూతురును కట్టబెట్టటం కంటే, ఆడిన మాట తప్పటం మేలనిపించింది! పరిస్థితి గమనించి మా కులపెద్దలు కూడా, నాకే వత్తాసుపలికారు. కాని, మా ఆస్తిపాస్తులు చూసిప్రలోభపడుతున్న, వీరనందుడు మాత్రం మమ్మల్ని నానా

దుర్భాషలూ ఆడి, మీదగ్గరకు తీసుకొచ్చాడు!" అంటూ ముగించాడు.

చంద్రన్నమాటలు పూర్తి అవుతుండగానే, వీరనందుడు చప్పున ఆవేశంగా ఏదో అన బోయాడు. కాని, న్యాయవర్ధనుడు, అతణ్ణి ఆగమన్నట్టు సైగచేసి, చంద్రన్నతో, "చంద్రన్నా! అయితే, పిల్లను ఎవరికిచ్చి పెళ్ళిచెయ్యాలని మీ ఆలోచన?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు చంద్రన్న ఒక్క క్షణం తడ బడి, "మహారాజా! ఇంతవరకూ ఆ సంగతి, మాలోనే గోప్యంగా వుంచుకున్నాం. ఇప్పుడు తమరు అడిగారు కాబట్టి చెబుతున్నాను. మా బావమరిది కొడుకు సారంగుడి ఈడువాడే. భగవంతుడి దయవల్ల ఈ తగువేదో సవ్యంగా తేలిపోతే, పిల్లను ఆ కుర్రవాడికిచ్చి చెయ్యా లన్నది, మా కోరిక," అన్నాడు.



చంద్రన్న మాటలు వినగానే, వీరనం దుడు మళ్ళీ రెట్టింపు ఆవేశంతో లేచి, ఏదో చెప్పబోయాడు. న్యాయవర్ధనుడు, అతణ్ణి మందలించి, "ఆవేశాలూ, కోపాలూ ఇక్కడ పనికిరావు, వీరనందా! మీ తగువు పూర్త యింది. అలా వెళ్ళి కూర్చోండి!" అన్నాడు.

వీరనందుడు ముఖం ముడుచుకుని, భటులు చూపించిన చోట కూర్చున్నాడు.

తర్వాతి ఫిర్యాదీ ఒక విదేశీ యువకుడు. వర్తకం కోసం సుభద్ర దేశానికి వచ్చిన, ఆ యువవర్తకుడి పేరు మణికర్ణుడు. రాజు అను మతించగానే, అతడాయనకు వినయంగా నమస్కరించి, చెప్పడంప్రారంభించాడు:

"మహారాజా! ఇక్కడికి కొద్ది దూరంలోనే వున్న సింహళద్వీపం, నా స్వస్థలం. నా తండ్రి, సోమగుప్తుడు మంచి వ్యాపారి. ఆయన బతికున్న రోజుల్లో, నేను వ్యాపారం గురించి ఆయన చెప్పిన విషయాలు పట్టించుకో కుండా, మిత్రులతో తిరుగుతూ కాలక్షేపం చేశాను. ఆయన కన్నుమూశాక, ఒక్కసారిగా నాకు, వ్యాపారం మీద ఆసక్తి కలిగింది. అయితే, నడమంత్రపు సిరిలాగే, వయ సొచ్చాక ఒక్క ఊపున కలిగిన, ఆ ఆసక్తి కూడా, నన్ను నేలకు నాలుగడుగుల పైనే నడి పించింది. మా నాన్న స్నేహితులైన పెద్దవాళ్ళు సలహాలు చెబుతూండగా, కొన్నాళ్ళపాటు వ్యాపారం చేసినట్టే చేసి, ఉన్నట్టుండి సముద్ర వ్యాపారం మీదికి దృష్టి మళ్ళించాను.

"ఎంతమంది వారిస్తున్నా వినక, పెద్ద మొత్తం ఖర్చుపెట్టి, మా ద్వీపంలో చవగ్గా దొరికే సుగంధ ద్రవ్యాలూ, కొబ్బరికాయలూ; కొబ్బరిపీచుతోనూ, ఏనుగుదంతాలతోనూ



ఒకదాన్ని అద్దెకు తీసుకుని, సరుకుతో సహా ఓడ దిగిపోయి, సరుకును గిడ్డంగుల్లో భద్రం చేయటం ఉత్తమమనీ, సరంగు ముందే చెప్పాడు. ఏ సంగతీ నిశ్చయించుకోవటానికి, రేవులో దిగిన తర్వాత, ఒక రోజు గడువిచ్చాడు.

"ఏ నిర్ణయం తీసుకోవటానికీ, నాకు వెంటనే తోచలేదు. వారం రోజుల్లో వ్యాపారం లాభసాటిగా పూర్తిచెయ్యగలనా, లేక గిడ్డంగి అద్దెకు తీసుకుని తాపీగా పనులు పూర్తి చేసుకోవటం మంచిదా? అని ఆలోచిస్తూ, రేవులో నిలబడి వుండి, ఇదిగో, ఈ రత్నగుప్తుడి కళ్ళబడ్డాను!" అంటూ క్షణం ఆగాడు.

మణికర్ణుడి మాటలు శ్రద్ధగావింటున్న, న్యాయవర్ధన మహారాజు, అతడు చూపించిన వైపుకు చూపుతిప్పి, అక్కడ కూర్చుని వున్న రత్నగుప్తుణ్ణి క్షణకాలం పరిశీలనగా చూశాడు.

నడి వయస్కుడైన రత్నగుప్తుడు, ఆ పట్టణంవాడే. దాదాపుగా ముప్ఫై సంవత్సరాల నుంచి వ్యాపార రంగంలో వుంటూ, రాజధానిలో ప్రముఖ వర్తకుడుగా చలామణీ అవుతున్నాడు. మహారాజుకు, అతడితో సన్నిహిత పరిచయంలేదుగాని, ముఖ పరిచయం మాత్రం వున్నది. మహారాజు, తన మీదికి చూపు తిప్పగానే, రత్నగుప్తుడు చప్పున లేచి నిలబడి, అత్యంత వినయంగా రాజుకు నమస్కరించాడు. రాజు అందుకు తల పంకించి, మణికర్ణుడి మీదికి దృష్టి సారించగానే, మణికర్ణుడు తిరిగి కొనసాగించాడు:

"మహాప్రభూ! ఈ రత్నగుప్తుడు నిశ్చయంగావ్యాపారంలో బాగా ఆరితేరిన మనిషి! సాలోచనగా నేను నిలబడిన తీరునూ, నా ముఖకవళికల్నీ బట్టి, ఆయన సంశయా

తయారుచేసిన అనేక రకాల వస్తువులూ కొని, వర్తకుల ఓడలో బైలుదేరాను. భగవంతుడి దయవల్ల, నా సముద్ర ప్రయాణం బాగానే సాగింది. దారిలో రెండు చిన్నచిన్న ద్వీపాల్లో కాస్త లాభసాటి వ్యాపారం కూడా చేసి, కళ్ళు మరికాస్త నెత్తికెక్కించుకున్నాను.

"మాప్రయాణపు ప్రారంభదినాల్లోనే, మా ఓడలోని వర్తకులు, నా సరుకుకు సముద్ర తీర ప్రాంతమైన మీ దేశంలో మంచి గిరాకీ వుందని చెప్పారు. అందుచేత, ఇక్కడ వ్యాపారం చేసి హెచ్చులాభాలు గడిద్దామన్న దురాశతో, సరిగ్గా నేటికి మూడు రోజుల క్రితం, ఇక్కడి రేవులో దిగాను. ఓడ ఇక్కడ వారం రోజుల కంటే ఎక్కువ వుండదనీ, అంతకంటే ఎక్కువరోజులు వుండతలచుకుంటే, రేవులో వున్న సరుకుల గిడ్డంగుల్లో



త్మకంగా వున్న నామనసును ఇట్టే గ్రహించాడు. వెంటనే నాదగ్గరకు వచ్చి, నన్ను పలకరించి, వివరాలు అడిగాడు. నేను అమాయకంగా, నా మొత్తం వివరాలూ, నా సరుకు గురించీ, అక్కడికక్కడే ఆయనకు చెప్పాను.

''అంతావిని, 'నాయనా, వ్యాపారానికి కొత్త వాడివి! వారంరోజుల్లో అంత లాభసాటిగా తెమల్చుకోలేవు. విదేశీయుడివని, నిన్ను స్థానికులు మోసం చేసే ప్రమాదమున్నది. ఇక గిడ్డంగి అదీ అద్దెకు తీసుకోవటం, అదీ చాలా ఖర్చుతో కూడుకున్నపని. అంతేకాదు, దానికి రాజానుమతి కావాలి. రాజు అనుమతిస్తూ, రాజముద్రవేసిన పత్రం చూపిస్తే గాని, విదేశీయులకు గిడ్డంగి అద్దెకివ్వరు. అదంతా చాలా పెద్ద తతంగం! నా కొడుకు లాంటి వాడివి, నిన్ను చూడగానే, నాకు నీ పట్ల ఏదో ఆత్మీయతాభావం కలిగింది. అందు చేత చెబుతున్నాను! మాది లంకంత ఇల్లు. ఇంటి వెనక భాగంలో ఒక పెద్ద గిడ్డంగి కూడా వున్నది. నువ్వు నన్ను నమ్మదలుచుకుంటే, సరుకు తీసుకుని నిరభ్యంతరంగా, మా ఇంటికిరా! సరుకు మా ఇంట భద్రపరచి, నువ్వు నా అతిథిగా వుండు. నీకు అవసరమైతే వ్యాపారపు సలహాలు కూడా చెబుతాను. తీరుబాటుగా వ్యాపారం ముగించుకుని, లాభాలతో తిరిగి వెళ్ళు!' అన్నాడు.

''పెద్దమనిషిలా కనిపిస్తున్న ఆయన వేషధారణనీ, అత్యంత సాత్వికంగా, ఆత్మీయంగా వున్న మాటల ధోరణినీ చూసి, నేను అనుమానం అనేది ఏకోశానా లేకుండా, ఆయన్ని నమ్మి, ఓడ సరంగుకు ఇవ్వవలసిందేదో యిచ్చేసి, సరుకునంతటినీ బళ్ళకెత్తించుకుని, ఆయన వెనక ప్రయాణ మయ్యాను. ఇల్లు చేరాక, రత్నగుప్తుడు తను స్వయంగా దగ్గర వుండి నౌకర్లచేత సరుకంతటినీ, మేడ మీది ఒక ఖాళీ గదిలో భద్రపరిచాడు. ఆ తరవాత, ఆ గదికి తనే స్వయంగా తాళం వేసి, తాళం చెవిని నా చేతికిచ్చాడు. అది చూశాక, నేను నా కన్న తండ్రి అతడిలో పరకాయ ప్రవేశం చేసి, నాకు సహాయపడుతున్నాడని ఆనందించాను.

''తర్వాత, నేను స్నానం అదీ చేశాక, నా కోసం రత్నగుప్తుడు తయారుచేయించిన విందుభోజనాన్ని ఇద్దరం కలిసి తిన్నాం. భోజనాలయ్యాక, సాయంత్రం దాకా నేను విశ్రాంతిగా పడుకుని గడిపాను.

''సాయంత్రం కాస్తపొద్దుమళ్ళాక, నన్ను గౌరవించే నిమిత్తం అంటూ, రత్నగుప్తుడు



నన్నొక విలాసమందిరానికి తీసుకుపోయాడు. అక్కడ చక్కని చుక్కల్లా వున్న నర్తకీమణులు కొందరు, మెరుపుతీగల్లా నాట్యం చేస్తున్నారు. మరికొందరు సౌందర్యవతులు, తమ గానామృతజలధిలో, వచ్చినవారిని ఓలలాడిస్తున్నారు. విలాసమందిరానికి వచ్చిన వారు కొందరు ద్రాక్షాసవం సేవిస్తున్నారు.

''నా తండ్రి బతికివుండగా, నేను యధేచ్ఛగా అక్కడా ఇక్కడా తిరిగే రోజుల్లో, నాకు అలాంటి వాతావరణం అలవాటే. అయితే, బాధ్యత ఒంట బట్టించుకున్న తర్వాత, అటువంటి విలాస మందిరానికి వెళ్ళటం అదే ప్రధమం. బుద్ధి ఎంత వచ్చినా, పాత అలవాట్లు మనసును ఇంకా అంటిపెట్టుకుని వున్నాయని నాకు ఆ క్షణానే బోధపడింది.

''విలాసమందిరంలో రత్నగుప్తుడు, కేవలం ప్రేక్షకుడుగానే కూర్చున్నాడు. నేను మాత్రం కడుపారా ద్రాక్షాసవం తాగి, విలాసినుల నాట్యాలు చూశాను. న్యాయవర్ధన మహారాజా! నేను నిర్దోషిననీ, న్యాయం నా పక్షాన వున్నదనీ, నాకు అంతరాంతరాల్లో వున్న ధైర్యం చేతనే, నా విలాస ప్రవర్తనను సైతం, మీ ముందు నిర్భయంగా ఒప్పుకో గలుగుతున్నాను.

''రత్నగుప్తుడు త్వరగానే లేచినా, నా బలవంతం మీద ఇద్దరం బాగా పొద్దుపోయేదాకా అక్కడే గడిపాం. అక్కడ అయిన ఖర్చంతా రత్నగుప్తుడే భరించాడు. నన్ను ఒక కానీ కూడా ఇవ్వనివ్వలేదు. ఇంటికి తిరిగి వస్తుండగా, ఆయన, 'మణికర్ణా! నీకు సహాయం చేసే నిమిత్తం, నీ సరుకు మొత్తం నేనే కొన దలిచాను. నా వ్యాపారానికీ, నీ సరుకుకూ ఏ మాత్రం సంబంధం లేకపోయినా ఆ తర్వాత ఇక్కడ చిన్నచిన్న వర్తకులకు ఆపాటి సరుకు అమ్మలేకపోను. ఏమంటావు?' అన్నాడు.

''ఆయన మాటలువినగానే, ద్రాక్షాసవపు నిషా బాగా తలకెక్కి వున్న నాకు, ఆనందపు నిషా కూడా మనసుకెక్కింది. నేను వెంటనే, మారుమాట లేకుండా, ఆయన చెప్పిన దానికి సమ్మతించాను. ఆ రాత్రంతా నేను కుబేరుడి కంటే గొప్పవాడినైనట్టు కలలు కంటూ సుఖంగా నిద్రపోయాను. అయితే, తెల్లవారిన తర్వాత, నిషాకాస్త తగ్గి నాబుద్ధి మళ్ళీ కాస్త పదునుతేలింది.

''కాలకృత్యాలు తీర్చుకున్న తర్వాత, రత్నగుప్తుణ్ణి కలుసుకుని, 'అయ్యా! మన ఉభయులకూ ఒకరిపట్ల ఒకరికి ఎంత

నమ్మకం వున్నాగానీ, నా సరుకును మీరు ఎంతకు కొనదలిచారో ఒక్కమాట అనుకుంటే బాగుంటుంది. మరొక చిన్న విషయం; నా దగ్గర పైకం చాలా తక్కువగా వున్నది; అంచేత మొత్తం సొమ్ములో ఎంతో కొంత ఇప్పుడు ఇవ్వగలిగితే నాకు కాస్త ఉపయోగిస్తుంది,' అన్నాను.

''రత్నగుప్తుడు నేను అన్నదానికి నొచ్చుకుని, 'అయ్యో! ఈ స్వల్పానికి ఇంతగా అడగాలా, నాయనా! ప్రస్తుతం ధరలెలా వున్నవో విచారించి, నీకు ఎంత సొమ్ము ముట్ట చెబుతానన్నది, సాయంత్రానికి తెలియబరుస్తాను. ప్రస్తుతానికి, ఈ పదివేల రూపాయలూ నీ దగ్గర వుండనీ! ఎటొచ్చీ, నువ్వన్నట్టు, ఇద్దరం వ్యాపారులం గనక, ఇదిగో, యీ తెల్లకాగితం మీద కాస్త చేవ్రాలు చేసి వెళ్ళు. నాకు కాస్త తీరుబడి దొరగ్గానే, పదివేలు నీకు ముందుగా ముట్ట జెప్పినట్టు కాగితంలో రాస్తాను,' అని పదివేలూ ఎంచి నాకిచ్చాడు.

డబ్బు కళ్ళబడగానే, మళ్ళీ నా బుద్ధి శుష్కించి, తెల్లకాగితం మీద నిక్షేపంగా చేవ్రాలు చేసి ఇచ్చాను. ఆ తర్వాత రత్నగుప్తుడు, ఏదో వ్యాపారపు హడావిడిలో వుండగా, నేను ఉబుసుపోకకు నగరంలో నాలుగు వీధులూ చుట్టి వద్దామని బైలుదేరాను. ఎటూ వచ్చానుగదా అని, నగరంలో నా సరుకుకు ఏపాటి ధర వున్నదో తెలుసుకుందామని విచారించిన నాకు, ఆశ్చర్యకరమైన సంగతి ఒకటి తెలిసింది. నా దేశంలో పదివేల రూపాయలకు కొన్న నా సరుకును, ఆ క్షణాన అమ్మితే సులువుగా నలభై, ఏభై వేలు వస్తాయి. అయితే, మరొక మూడు



నెలలో ఇక్కడ పెద్ద ఎత్తున వసంతోత్సవాలు జరగబోతున్న కారణంగా, మరొక నెలా పదిహేనురోజులు ఆగి అమ్మితే, దాదాపుగా ఎనభై వేల పైచిలుకు సొమ్ము కళ్ళ జూడవచ్చు!

''ఆ సంగతులన్నీ వినగానే, నాతో అంత ఆప్యాయంగా మాట్లాడిన పెద్దమనిషి రత్నగుప్తుడు, ఇవేమీ నాకు ఎందుకు చెప్పలేదా అని ఆశ్చర్యపడ్డాను. ఆయన కూడా ఒక పెద్ద వర్తకుడు గనక, ఇవేమీ ఆయనకు తెలియవనుకోవటానికి, నామనసు అంగీకరించలేదు. ఏదో అనుమానంతో, రత్నగుప్తుడి గురించి ఆరా తీశాను. అందరూ ఆయన చాలా మంచివాడనీ, నిజాయితీపరుడనే చెప్పారు. దానితో నన్ను నేనే సమాధానపరుచుకుని, ఇంటికి తిరిగివెళ్ళాను. నేను ఇల్లు చేరేసరికి, రత్నగుప్తుడు, 'ఒంటరిగా

ఎక్కడికి వెళ్ళావు. మణికర్ణా?' అంటూ ప్రశ్నించాడు.

'నేను ఏదీ దాచకుండా అంతా వివరంగా చెప్పి, 'అయ్యా మీరు నాకు ఎంత ముట్ట జెప్ప దలుచుకున్నారో, కాస్త చెప్పండి!, అంటూ ప్రార్థించాను.

''వెంటనే రత్నగుప్తుడు, 'ఏమిటయ్యా ఇది! నీ సరుకు మొత్తం నలభైవేల రూకలకు, నాకు అమ్మివేసి, చిల్లిగవ్వ వదలకుండా, సొమ్ము మొత్తం పుచ్చుకుని, మళ్ళీ ఎంత ముట్టజెబుదారంటావేమిటి? పొద్దునే మద్యం తాగి వచ్చావా ఏం?' అన్నాడు

''ఆ మాటలకు నేను కొయ్యబారి పోయాను. అంతే, ఇద్దరికీ మాటామాటా పెరిగింది. రత్నగుప్తుడు, నాచేవ్రాలు వున్న కాగితం తెచ్చి చూపించాడు. అది ఉదయం నేను స్వయంగా చేవ్రాలు చేసిన తెల్లకాగితమే! ఇప్పుడు దాంట్లో, నా చేవ్రాలుకు పైన, నా సరుకు మొత్తం రత్నగుప్తుడికి, నలభై వేలకు అమ్ముతున్నట్టూ, సొమ్ము మొత్తం ముట్టినట్టూ రాసి వున్నది.

''ఉదయం, ఆ తెల్ల కాగితం మీద చేవ్రాలు చేస్తున్నప్పుడు, పైన 'పదివేలు ముట్టినవి' అని రాస్తాడనుకున్నాను గాని, ఇంత దగా చేస్తాడనుకోలేదు. మనిషిలో మంచితనాన్ని గుడ్డిగా నమ్మి, అజాగ్రత్తగా ప్రవర్తించట మనేది, వ్యాపార సూత్రాలకే విరుద్ధం. నేను ఆ విరుద్ధపుపని చేసి, కళ్ళున్న గుడ్డివాడిలా నిలువు లోతు గోతిలో పడ్డాను.

''మహారాజా! దయచేసి నా నిర్దోషిత్వాన్ని నమ్మి, నా సరుకు నాకు తిరిగివచ్చేలా చెయ్యండి! మహారాజా, అన్నట్టు మరిచి పోయాను, సరుకు భద్రంచేసిన గది తాలూకు తాళంచెవి కూడా ప్రస్తుతం, నా దగ్గర నుంచి మాయమైంది. మహాప్రభూ! యదార్థం గ్రహించండి!'' అంటూ సుదీర్ఘమైన తన కథనాన్ని ముగించి, ఉస్సురని నిట్టూర్చాడు మణికర్ణుడు.

-(ఇంకావుంది)



# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు:

1872వ సం॥ ఆగస్ట్ 15 వ తేదీన కలకత్తా నగరంలో డా॥కె.డి.ఘోష్- స్వర్ణలతాదేవి దంపతులకు జన్మించిన శ్రీ అరవిందఘోష్‌ను అతి పిన్నవయసులోనే డార్జిలింగ్‌లోని ఐరిష్ కాన్వెంటులో చేర్పించారు. ఆ తరవాత 1879వ సం॥లో ఇంగ్లాండుకు తీసుకు వెళ్ళారు. అరవిందుల మీద భారతీయ సంప్రదాయాల ప్రభావం పడకూడదనే ఆయన తండ్రి అలా చేశాడు.

అరవిందులు లండన్‌లోని సెయింట్ పాల్స్ స్కూలు విద్యార్థిగా, ముఖ్యమైన బహుమతులన్నీ అందుకున్నారు. ఆ తరవాత స్కాలర్‌షిప్‌తో కేంబ్రిడ్జ్ కింగ్స్ కాలేజీలో చేరారు.

ట్రిపోస్‌ను ప్రథమ శ్రేణిలో పూర్తి చేసి, సుప్రసిద్ధమైన ఇండియన్ సివిల్ సర్వీస్ పోటీ పరీక్షలలోనూ ఉత్తీర్ణులయ్యారు. అయితే ఆ పదవీ బాధ్యతలు చేపట్టడం ఇష్టంలేక గుర్రపు స్వారీ పరీక్షకు హాజరు కాలేదు. ఆ సమయంలో లండన్‌లో వున్న బరోడా మహారాజు సర్ సాయాజీ రావు గేక్వాడ్, తన ప్రభుత్వంలో అరవిందులకు స్థానం కల్పించాడు. 1893వ సం॥లో అరవిందులు భారత దేశానికి తిరిగి వచ్చి బరోడాలోని మహారాజా కాలేజీలో ఇంగ్లీష్ - ఫ్రెంచి ఉపన్యాసకులుగా చేరారు.


శ్రీ అరవిందులు

కొంతకాలానికి ఆయన సంస్కృతంతో పాటు మరి కొన్ని భారతీయ భాషలను నేర్చుకున్నారు. అంతకు ముందే ఆయనకు గ్రీకు, లాటిన్ భాషలు వచ్చు. భారతీయ మత గ్రంథాలనూ, సాహిత్యాన్నీ అధ్యయనం చేస్తూ, యోగాభ్యాసం ప్రారంభించారు. విశ్వాస పాత్రులయిన కొందరు అనుచరుల ద్వారా, దేశంలోని పలు ప్రాంతాలలో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా పోరాడడానికి యువకులను ఆయత్తపరిచారు.

1906వసం॥లో ఆయన బరోడా నుంచి కలకత్తా చేరుకున్నారు. కొందరు దేశభక్తులు స్థాపించిన మొట్ట మొదటి జాతీయ కళాశాలకు ప్రిన్సిపాలుగా కొన్నాళ్ళు పనిచేసి, ఆ తరవాత జాతీయ విప్లవ భావాలతో వెలువడిన 'వందేమాతరం' వార్తా పత్రిక సంపాదకులయ్యారు.

1907వ సం॥లో అరవిందులు, లోకమాన్య బాలగంగాధర తిలక్ కలిసి సూరత్ మహాసభలో భారత జాతీయ కాంగ్రెస్‌ను అతివాదంకేసి కొత్త మలుపు తిప్పారు. నిజానికి భారతమాతకు సంపూర్ణ స్వరాజ్యం కోరిన మొట్ట మొదటి భారతీయుడు శ్రీ అరవిందులు.

1908వ సం॥లో ఆయనను అలిపూర్ కుట్ర కేసులో నిందితుడుగా ఖైదు చేశారు. ఒక సంవత్సరం జైలులో ఒంటరిగా గడిపారు. ఆసమయంలో ఆయన కొన్ని అరుదైన ఆధ్యాత్మిక అనుభూతులకు లోనయ్యారు. ఆయన విడుదల చేయబడ్డాడు గాని, పాలకులు మళ్ళీ ఖైదు చేసి వేరొక చోటికి పంపాలని ప్రయత్నించారు. అయితే అరవిందులు వాళ్ళకు తెలియకుండా ఫ్రెంచి కాలనీ అయిన పాండిచ్చేరికి చేరుకున్నారు.

ఆయన జీవితంలో నూతన అధ్యాయం ఆరంభమయింది. నిరంతరం యోగం అభ్యసిస్తూ, దాని ద్వారా జీవిత రహస్యాలను గ్రహించసాగారు. పరిణామ క్రమంలో మానవుడు చిట్టచివరి దశకు చెందినవాడు కాదని ఆయన తెలుసుకున్నారు. మనసుతో కాకుండా, దానికన్నా సర్వోత్కృష్టమైన చైతన్యంతో నియంత్రింపబడే పరిపూర్ణ మానవుడుగా మనిషి పరిణతి చెందగలడు. మనసుకు అతీతమైన చైతన్యంగా అరవిందులు దీనిని పేర్కొన్నారు.

శ్రీఅరవిందుల జన్మదినం రోజున భారత దేశం స్వాతంత్ర్యం పొందింది.

మానవజాతి భవిష్యత్తును గురించి, శ్రీ అరవిందులు వెలిబుచ్చిన అభిప్రాయాల పట్ల ప్రపంచ వ్యాప్తంగా ఈనాడు పలువురు ఆసక్తి కనబరుస్తున్నారు!

**ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు –**
**తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!**

## 8. పవిత్ర భారత భూమి




దసరా సెలవులు వచ్చాయి. మామూలుగా సెలవు రోజుల్లో తమతో ఆడుకోవడానికి వచ్చే సందీపుడూ, శ్యామలా ఇప్పుడెందుకు రావడం లేదా అని ఇరుగు పొరుగు పిల్లలు మొదట ఆశ్చర్యపడ్డారు. ఆ తరవాత రోజూ సాయంకాలం నదీతీరంలో ఒక తాతయ్య వెనక ఆయన చెప్పేవి వింటూ అన్నాచెల్లెళ్ళు నడవడం వాళ్ళు గమనించారు.

ఒకనాడు కిశోర్,రమ అనే మరో ఇద్దరు అన్నాచెల్లెళ్ళు సందీపుణ్ణి వెతుక్కుంటూ వచ్చారు. సందీపుడు శ్యామలతో కలిసి తాతయ్య వెంట వెళ్ళినట్టు తెలిసింది. ఇద్దరూ వెళ్ళి, తాతయ్య వెంట ఏదో కథ వింటూ వెళుతూన్న సందీపుడికి వెనక, మెల్లగా నడవసాగారు. తాతయ్య చెబుతూన్న కథ వినడంలో లీనమై పోవడం వల్ల– సందీపుడుగాని, శ్యామలగాని తమ మిత్రులు రావడం గమనించలేదు. అర గంట తరవాత, తాతయ్య కథ చెప్పడం పూర్తి చేయగానే, "ఎంత బావుందీ!" అంటూ ఎగిరి గంతేశాడు కిశోర్ తనకు తెలియకుండానే. ఆ మాట విని ముందు నడుస్తూన్న ముగ్గురూ వెనక్కు తిరిగి చూశారు. సందీపుడు, శ్యామల వాళ్ళను చూసి చిన్నగా నవ్వారు. తమ స్నేహితులను తాతయ్యకు సంతోషంగా పరిచయం చేశారు.

"మన పిల్లల స్నేహితులు ఒక్కరూ రారేమిటా అని అప్పుడప్పుడూ అనుకునే వాణ్ణి. అయినా, వాళ్ళు సెలవుల్లో మీతో ఆడుకోవడానికి రాకపోవడానికి నా తప్పేమయినా వుంటే నన్ను క్షమించండి!" అన్నాడు తాతయ్య దేవనాధుడు కొత్తగా వచ్చిన పిల్లలతో, చిన్నగా నవ్వుతూ.

"ఊహూం, క్షమించం. తప్పు చేసిన వాళ్ళను శిక్షించకుండా వదలడం మా అలవాటు కాదు," అని కొంతసేపు ఆగి, "మీరు మాక్కూడా కథలు చెప్పితీరాలి!" అన్నది రమ.

విశ్వావసు

# ...తి - చరిత్ర



దేవనాథుడు పెద్దగానవ్వి, ''నాకు మరి ద్దరు మనమలు లభించారు కదా! మరి దానికి తగ్గ మూల్యం చెల్లించక తప్పుతుందా?'' అన్నాడు.

''బావుంది. సరే, ఎప్పుడు రమ్మన్నారు చెప్పండి,'' అని అడిగాడు కిశోర్.

''రేపు సాయంకాలం!'' అన్నాడు దేవ నాథుడు.

మర్నాడు సాయంకాలం జార్జ్, జూలీ అనే మరిద్దరు స్నేహితులను వెంటబెట్టుకుని రమ, కిశోర్ వచ్చారు. సందీపుడి ఇంటి ముందున్న పచ్చిక మైదానంలో అందరూ కూర్చున్నారు. కొంతసేపటికి చెవులు చిల్లులు పడేలా లౌడ్ స్పీకర్ నుంచి సినిమా పాటలు వినిపించ సాగాయి.

'' ఇవి పండుగ రోజులు... దుర్గాపూజ కదా! అందుకే ఈ పాటల హడావుడి!'' అన్నాడు కిశోర్.

''ఎదుటి వారు పడే ఇబ్బందుల గురించీ, వారి మనోభావాల గురించీ ఏ మాత్రం పట్టించు కోకపోవడం వల్లే ఇవన్నీ జరుగుతున్నాయి. ప్రాచీనకాలం నుంచి పండుగ రోజులు వస్తు న్నాయి, పోతున్నాయి. యేటేటా ప్రజలు అమ్మ వారికి పూజలు చేస్తూ, మొక్కుబడులు చెల్లి స్తూనే ఉన్నారు. ఇటీవలే ఈ పాటల హోరు ప్రారంభమయింది. మన భక్తి, ఎదుటి వారి అసౌకర్యానికి కారణం కాకూడదన్న జ్ఞానం చాలా మందికి లేదు. ఈ లౌడ్ స్పీకర్ల రొద మరీ దారుణం. అసలు దీనికి కారణం భక్తి కాదు. వాటి శబ్దం స్థాయి, వాటిని జరిపే కార్యకర్తల దౌర్జన్య ధోరణికీ, అహంభావానికీ కొలబద్ధగా ఉంటున్నది. మునుముందు ఇలాంటి కార్యక్రమాలు జరిపే అవకాశం మీకు గనక వస్తే-అవి ఇతరులకు ఇబ్బందికరంగా ఉండకుండా చూసుకోండి,'' అన్నాడు దేవ నాథుడు.



''అలాగే తాతయ్యా! అసలు ఈ దసరా ఉత్సవాలు అనేవి ఎప్పుడు ఆరంభమయ్యా యంటారు?'' అన్నాడు సందీపుడు.

''రాక్షసరాజు రావణుణ్ణి సంహరించిన తరవాత, శ్రీరాముడు తనకు విజయం సమ కూర్చినందుకు జగన్మాతకు కృతజ్ఞతలు తెలియ చేస్తూ పూజలు జరిపాడట. దసరా అంటే దశ నిర్మూలం, అంటే దశకంఠ(పదితలల) రావణ సంహారం అని అర్థం. అయితే, ఈ ఒక్క కారణం వల్లనే దసరా ఉత్సవాలు ప్రారంభ మయ్యాయని రూఢిగా చెప్పలేము. ఎందు

కంటే దీనికి మరికొన్ని కారణాలుకూడా చెబుతారు. అయితే, ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే– మనదేశంలో వివిధ ప్రాంతాలలో, విభిన్నరూపాలలో, అనేక నామాలతో జగన్మాతను పూజిస్తున్నారు. ఇది నిజం," అన్నాడు దేవనాథుడు.



"అది ఎలా జరిగింది?" అన్నారు అందరూ ఒక్కసారిగా.

"దానిని తెలుసుకోవాలంటే మనం సృష్ట్యాదికి వెళ్ళాలి. మన ఆధ్యాత్మిక సాహిత్యాన్ని పరిశీలించినట్టయితే– పరిమిత పదార్థాలలో, పరిధిలో అపరిమితశక్తి దాగివుండడమే సృష్టి రహస్యం అని తెలియవస్తుంది. అణువులోపల అనంతం! అదొక దాగుడు మూతల ఆట! ఆత్మసాఫల్యం కోసం, ఆత్మసిద్ధి కోసం, అనంత శక్తి ఆడుకునే వినోదక్రీడ! విచిత్ర లీల!

బ్రహ్మ సృష్టికర్త అని మీకు తెలుసు. ఆయన కుమారులలో ఒకడైన దక్ష ప్రజాపతి– దేవ, దానవ, మనుజ, జంతుగణ ఉత్పత్తికి కారణభూతుడయ్యాడు. దక్షుడు, బ్రహ్మ కుడి బొటనవేలి నుంచి పుట్టాడు. బ్రహ్మ ఎడమ బొటన వేలినుంచి పుట్టిన విరణిని దక్షుడు పెళ్ళాడాడు. ఈనాడు కూడా పెళ్ళి పీటల మీద పెళ్ళికూతురు ఎడమవైపున కూర్చోవడానికి బహుశా ఇదే కారణం కావచ్చు. దక్షుడికి యాభైమంది కుమార్తెలు కలిగారు. వారిలో నలభైతొమ్మిదిమందిని దేవతలు, దేవర్షులు పెళ్ళాడారు. వారినుంచే మానవజాతి ఉత్పన్నమయింది.

దక్షుడి చిన్నకూతురు సతీదేవి తండ్రి అభీష్టానికి విరుద్ధంగా శివుణ్ణి వివాహమాడింది. కుమార్తె చర్య తండ్రికి ఆగ్రహకారణమయింది. కొంతకాలానికి దక్షుడు యజ్ఞం చేయ తలపెట్టాడు. యజ్ఞానికి సకల దేవతలనూ, ఋషులనూ, కూతుళ్ళనూ, అల్లుళ్ళనూ ఆహ్వానించాడు. అయితే శివుణ్ణీ, సతీదేవినీ మాత్రం పిలవలేదు. తన తండ్రి యజ్ఞం చేస్తూన్న విషయం సతీదేవికి తెలిసి అక్కడికి బయలుదేరింది. పిలవని పేరంటం వద్దని శివుడు హెచ్చరించాడు. కన్నవాళ్ళింటికి వెళ్ళడానికి పిలుపు అవసరం లేదని భర్తకు నచ్చజెప్పి, సతీదేవి బయలుదేరి వెళ్ళింది.

ఆమెను చూడగానే దక్షుడు అహంకారంతో శివుణ్ణి దూషించాడు. ఇల్లూ వాకిలీ లేనివాడనీ; దుస్తులు సరిగ్గా ధరించడం తెలియని జంతు చర్మధారి అనీ, దయ్యాలకూ భూతగణాలకూ నాయకుడనీ శివనింద చేశాడు. ఆ మాటలు భరించలేక సతీదేవి అగ్నిలో దూకి మరణించింది. అనుకోని ఈ దుర్ఘటనకు అందరూ దిగ్భ్రాంతులయ్యారు. సతీదేవి వెంటవచ్చిన కొందరు భూత గణాలు కైలాసానికి వెళ్ళి,

జరిగిన వైపరీత్యాన్ని శివుడికి తెలియజేశారు. అమితావేశం చెందిన శివుడు తన జటా జూటం లోని ఒక జడనులాగి నేలకు కొట్టాడు. అందులోనుంచి వెయ్యి చేతులతో వీరభద్రుడు అవతరించాడు.

వీరభద్రుడు దక్షుడి యజ్ఞవాటికకు వెళ్ళి నానాబీభత్సం సృష్టించి, యజ్ఞనాశనం చేశాడు. కొంతసేపటికి శివుడు అక్కడికి చేరి త్రిశూలంతో దక్షుడి శిరస్సును ఖండించాడు.

దక్షుడి భార్యా, దేవతలూ-దక్షుడి అపరాధాన్ని క్షమించమని శివుణ్ణి ప్రార్థించారు. శివుడు శాంతించాడు. దక్షుణ్ణి క్షమించి ప్రాణభిక్షపెట్టాడు. దక్షుడి శిరస్సు కనిపించకపోయే సరికి మేకతలను తెచ్చి అతని మెడకు అతికించారు.

శివుడు సతీదేవి దేహాన్ని భుజంపైకెత్తుకుని సర్వం మరిచి భూలోకమంతటా ఉన్మాదిలా తిరగసాగాడు. ఆఖరికి శ్రీమహావిష్ణువు తన సుదర్శన చక్రంతో సతీదేవి శరీరాన్ని ముక్కలుగా చేయవలసివచ్చింది. సతీదేవి శరీర అవయవాలు దేశమంతటా అక్కడక్కడా పడ్డాయి. సతీదేవి జగన్మాత అని ఋషులందరూ గ్రహించారు. ఆమె శరీర అవయవాలు పడిన చోట్లలో ఆలయాలు నిర్మించారు. అలా ఆసేతుహిమాచల పర్యంతం ఎక్కడ చూసినా శక్తి దేవాలయాలు వెలిశాయి. అందువల్లే భౌతిక స్థాయిలోనూ మనదేశం ఎంతో పవిత్రమైనదిగా భావించబడుతోంది. ఇది అతి ప్రాచీనకాలం లో జరగడంవల్ల అప్పటి నుంచే మనదేశంలో శక్తిని పూజించే సంప్రదాయం ఏర్పడింది. దుర్గ, కాళి, ఛండి ఇలా పేర్లు వేరైనా జగన్మాత ఒక్కటే!'' అని ముగించాడు దేవనాధుడు.

''ఇది పాత కథే కదా?'' అని అడిగింది శ్యామల.

''ఇది పాత కథే. అయినా పురాణ కథ అని చెప్పడమే సబబు. ఇలాంటి పురాణ కథలు మన దేశంలో చాలా ఉన్నాయి,'' అంటూ దేవనాధుడు లేచి నిలబడ్డాడు.

''మరిన్ని పురాణ కథలు వినడానికి మమ్మల్ని ఎప్పుడు రమ్మన్నారు?'' అని అడిగాడు కిశోర్.

''మీ చదువులు పూర్తి చేసుకుని, తీరిక ఉన్నప్పుడు ఎప్పుడు వచ్చినా, చెప్పడానికి నేను సిద్ధమే!'' అంటూ దేవనాధుడు ఇంటి లోపలికి నడిచాడు. —(ఇంకావుంది)





# అత్తాకోడళ్ళ మంచితనం

సరళకు మొత్తం వేమవరం అగ్రహారంలో అల్లరిపిల్ల అనిపేరు. అంతే కాదు, అది తగవులమారికూడా. బుద్ధిగా కూర్చున్న వాళ్ళను కూడా, ఎలాగో రెచ్చగొట్టి గొడవ పెట్టుకుంటుంది. అలాంటి సరళకు పెళ్ళీడు వస్తే, అది అత్తవారింట్లో ఏం చేస్తుందో అని తల్లి తండ్రులు బెంగపెట్టుకున్నారు.

అయితే, అనుకోకుండా సరళకు చక్కటి పెళ్ళిసంబంధం వచ్చింది. వరుడురాజయ్య చదువుకున్నవాడు. ఎంతో బుద్ధిమంతుడని పేరు. బడిపంతులుగా పనిచేస్తున్నా, తల్లి తండ్రులు సంపాదించియిచ్చిన ఆస్తిపాస్తులు కూడా వున్నాయి. ఒక్కొగానొక్క కొడుకు కాబట్టి ఆస్తంతా అతడిదే. ఆడబిడ్డ పోరు వుండదు.

ఇలా అన్నీ బాగానే వున్నాయి కానీ, రాజయ్య తల్లి సుభద్రమ్మ మహాగయ్యాళి అని పేరు. ఆవిడనోటికి జడిసి ఎందరో ఇంటిపనివాళ్ళు మారిపోయారట. తీరిగ్గా కూర్చుని గొడవలు పెట్టుకునే మనస్తత్వంతో అందర్నీ బాధిస్తుందిట. తన ఇంట్లో తన గురించి తప్ప, ఇంకెవరిగురించీ మంచిగా చెప్పుకోవడం ఆవిడ కిష్టముండదు.

ఈ కారణాల వల్ల ఇటు సరళతల్లి తండ్రులూ, అటు రాజయ్య తండ్రీ కూడా తటపటాయించారు. కానీ సరళకూ, సుభద్రమ్మకూ మాత్రం ఏ అభ్యంతరమూ లేక పోయింది.

''నేనెంతోమంచిదాన్ని. అయినా నా మంచి తనానికి అసలు గుర్తింపు లేదు. కోడలిపిల్ల అల్లరిపెట్టేదైతే, అప్పుడు అందరికీ నామంచి తనం అర్థమవుతుంది. సరళను మనింటి కోడల్ని చేసుకుందాం!'' అన్నది సుభద్రమ్మ భర్తతో.

''నేను చాలామంచిదాన్ని. గయ్యాళి అత్తతో కూడా మంచిగా వున్నప్పుడే, నామంచి

జొన్నలగడ్డ రామలక్ష్మి

తనానికి గుర్తింపువస్తుంది. రాజయ్య నాకు నచ్చాడు. ఈ పెళ్ళినాకిష్టమే!'' అన్నది సరళ తల్లితండ్రులతో.

రాజయ్యకు కూడా సరళ రూపురేఖలు నచ్చాయి. అందువల్ల త్వరలోనే వాళ్ళిద్దరికీ పెళ్ళిజరిగిపోయింది.

కూతురు అత్తవారింటికి వెళ్ళాక, అత్త మామల నుంచి ఎలాంటి ఫిర్యాదులు విన వలసివస్తుందో అని సరళ తల్లితండ్రులు బెంగగా వున్నారు. సరళ ఏ క్షణాన పుట్టింటికి వెళ్ళిపోతానని రాద్ధాంతం చేస్తుందో అని, రాజయ్య తండ్రి భయపడేవాడు. కానీ విచి త్రంగా ఆ ఇల్లు ఎంతో ప్రశాంతంగా వుంటు న్నది. రాజయ్య సుఖంగా భార్యతో కాపురం చేస్తున్నాడు.

అంతేకాదు-చుట్టుపక్కల తన తోటి వారితో మాట్లాడేటప్పుడు సరళ, అత్తగారి మంచితనాన్ని ఎంతోగొప్పచేసిచెబుతూండేది. తన ఈడువారితోమాట్లాడేటప్పుడు సుభద్రమ్మ కోడలి గుణగుణాల్ని ఆకాశాని కెత్తేసేది. ఇది అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తేస్తుండేది.

కొన్నాళ్ళకు సరళ పుట్టింటికి వచ్చింది. అడిగిన వారందరివద్దా సరళ, అత్తగారి గుణ గణాల్ని అదేపనిగా మెచ్చుకుంది.

సరళ వచ్చిన నాటి రాత్రి ఆమె తల్లి, ''నీ అదృష్టానికి నేనెంతో పొంగిపోతున్నానమ్మా!'' అన్నది.

''ఇప్పుడేమైందని నువ్వు అంతగా పొంగి పోవడం,'' అన్నది సరళ చిరాగ్గా.

''అత్తవారింట కూతుర్ని ఆరళ్ళు పెట్టక పోతే, అదిమామూలుఅదృష్టం కాదు గదా!'' అన్నది సరళతల్లి.



''నా అత్త ఆరళ్ళు పెట్టదని ఎందుకను కున్నావు?'' అని అడిగింది సరళ.

''అసలే ఆవిడ మహాగయ్యాళి అని పేరు మరి!'' అన్నది సరళతల్లి.

''ఆ విషయం తెలుసుకదా! అలాంటి మహాగయ్యాళిని మెప్పించానని నన్ను మెచ్చు కోవేం?'' అన్నది సరళ.

''ఆవిణ్ణి మెప్పించడం ఎవరివల్లా కాదని అందరికీ తెలుసు. అంతా నీ అదృష్టమే!'' అన్నది సరళ తల్లి.

''అయితే విను! ఆవిడ నన్ను ఆరళ్ళు పెడుతూనే వుంది. నేనెంతో మంచిదాన్ని కాబట్టి, ఆవిడను పొగుడుతున్నాను. కన్న తల్లి వయుండీ నువ్వయినా, నా మంచితనాన్ని పొగడక పోతే నాశ్రమంతా వృధా,''అన్నది సరళ విచారంగా.

''అయ్యో, తల్లీ! అలాగా! నాకీ ఆలోచనే రాలేదు. నేను వచ్చి, నీ అత్తతో మాట్లాడి ఇంత మంచికోడల్ని ఆరడి పెడతావా అని మంద లించి వస్తాను,'' అన్నది సరళతల్లి.

"వద్దులే అమ్మా! నువ్వు నామంచితనాన్నీ, అత్తగారి దుర్మార్గాన్నీ గుర్తిస్తే చాలు," అన్నది సరళ.

అయితే, సరళతల్లికి మాత్రం మనసుండ బట్టక, ఆ ఊళ్ళోనే వున్న సరళఅత్త సుభద్రమ్మ దూరపుబంధువు మీనాక్షమ్మను కలుసుకుని విషయం చెప్పి, ''నువ్వు కాస్త ఆ సుభద్రమ్మను మందలించి రావాలి!'' అన్నది.

మీనాక్షమ్మ వెంటనే ముక్కున వేలేసు కుని, "ఆసినీ! ఈ అత్తాకోడళ్ళిద్దరూ దొందు దొందే!'' అనేసింది.

సరళ తల్లి ఆశ్చర్యపోయి, ''ఇంతకూ అసలు సంగతేమిటి?'' అని అడిగింది.

మీనాక్షమ్మ వచ్చేనవ్వును ఆపుకుంటూ, '' నేను పోయిన నెల సరళ అత్తగారి ఊరు వెళ్ళి వచ్చాను. సుభద్రమ్మ నేనడక్కుండానే కోడలి గుణగణాలు మెచ్చుకున్నది. నేను అలావిని వూరుకోక- అలాంటి కోడలు దొర కడం, నీ అదృష్టం సుభద్రమ్మా! అన్నాను. అంతే! సుభద్రమ్మ మండిపడుతూ- ఆ సరళ గురించి అందరికీ తెలుసుకదా! అది నన్ను ఎంత ఎదిరించినా, నేను దాన్ని పొగుడు తూంటే, నువ్వు నా మంచితనాన్ని అర్థం చేసు కోవడానికి బదులు, ఏదో అదృష్టమంటూ మాట్లాడతావేమిటి? అన్నది. అదీ అసలు సంగతి! ''అన్నది.

మీనాక్షమ్మ చెప్పింది విని సరళతల్లి తెల్ల బోయింది. ఒకరికొకరు చెడ్డపేరు తేవాలనే, ఆ అత్తాకోడళ్ళిద్దరూ పరస్పరం పొగుడుకుంటు న్నారు.

'' ఇద్దరి ఉద్దేశాలూ చెడ్డవే! కానీ రెండు చెడ్డలూ కలిసి, ఆ కుటుంబానికి మాత్రం మేలే చేశాయి. ఉష్ణం ఉష్ణేన శీతలం అంటే ఇదేనేమో!'' అన్నది మీనాక్షమ్మ.

అప్పుడు సరళతల్లి ముక్కున వేలేసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయింది.



కావేరీ తీరంలోని వైదీశ్వరన్ కోయిల్ అనే చిన్న పట్టణంలోని ప్రధాన వీధిలో పురాతన శివాలయం ఉన్నది. ఇక్కడి దేవుణ్ణి వైద్యులకు వైద్యుడైన వైదీశ్వరుడిగా పూజిస్తారు. విరివిగా ఉన్న అగస్త్యనాడి జ్యోతిష్కులకారణంగా ఈ పట్టణం మరింతప్రసిద్ధిగాంచింది. ప్రతి ఒక్కరి జీవితం గురించీ- భూత, భవిష్యత్, వర్తమానాలనుగురించీ తాళపత్రాలలో రాయబడివుందనీ,




కావేరీ తీర ప్రయాణం-11

# ప్రయాణం పరిసమాప్తి

రచన: జయంతి మహాలింగం చిత్రాలు: గౌతమ్ సేన్

వాటిని వేలాది సంవత్సరాలకు పూర్వం అగస్త్యముని అక్షరబద్ధం చేశాడనీ చెబుతారు. ఈ జ్యోతిషమే వృత్తిగా పలువురు ఇక్కడ ఉన్నారు. తమ భవిష్యత్తును గురించి తెలుసుకోవాలని వచ్చేవారి నుంచి, జ్యోతిష్కులు మొదట బొటనవేలిముద్ర తీసుకుంటారు. లోపలికి వెళ్ళి అసంఖ్యాకంగా వున్న తాళపత్రాలనుంచి, వచ్చినవారి కుటుంబాన్ని గురించి రాయబడి వున్న తాళపత్రాన్ని వెదికి చూసి తెస్తారు. ఒకటిరెండు గంటలు కాచుక్కూర్చున్నాక వచ్చినవారి వృత్తి, కుటుంబ వివరాలు, జరిగిన ముఖ్య సంఘటనలు మొదలైన వాటిని తెలియజేస్తారు. ఇదంతా పెద్దమోసం అని కొందరు కొట్టిపారేస్తారు. అయితే, ఆ జ్యోతిష్యాన్ని నమ్మి ఇప్పటికీ చాలామంది వస్తూనే ఉన్నారు. నాడీ జ్యోతిష్కుల నిజాయితీని ఏమాత్రం శంకించకుండా తమ భవిష్యత్తును గురించి తెలుసుకుని వెళుతూనే ఉన్నారు.



చిదంబరం నటరాజు ఆలయం

వైదీశ్వరన్ కోయిల్, చిదంబరం మధ్య సుప్రసిద్ధ శివభక్తకవి తిరుజ్ఞాన సంబందర్ జన్మస్థలమైన 'సీర్గాళి' అనే చిన్నపట్టణం ఉన్నది. సంబందర్ మూడేళ్ళ ప్రాయంలోనే శివుణ్ణి స్తుతిస్తూ, పదకొండు పాదాల పద్యాన్ని ఆశువుగా ఆలపించాడని చెబుతారు.

కావేరీనది ఉత్తరశాఖ కొళ్ళిడం విడిపోయే చోట చిదంబర నగరం ఉన్నది. శైవులు పరమ పవిత్రంగా భావించే ఇక్కడి

నటరాజ ఆలయంలో పంచ భూతలింగాలలో ఒకటైన ఆకాశలింగం ఉన్నది. ఎడమ పాదాన్ని ఆకాశం కేసి పైకెత్తి నాట్యం చేసిన ఆనందతాండవ భంగిమలోనూ శివుణ్ణి పూజి స్తారు. ఇక్కడే శివపార్వ తుల మధ్య నాట్యం పోటీ జరిగిందని పురాణాలు పేర్కొంటాయి. శివుడు ప్రద ర్శించిన ప్రతిభంగిమనూ, ఆయనకు దీటుగా పార్వతి అనుకరించి చూపిందట. చివరికి శివుడు కుడికాలిపై నిలబడి, ఎడమ కాలిని ఆకాశం కేసి భుజాల పైకెత్తా డట. పార్వతి ఆ ఆనంద తాండవ భంగిమను అను కరించలేక సిగ్గుతో తల దించుకుని భర్త ఎదుట ఓటమిని అంగీకరించిందట.



చిదంబర నటరాజును దర్శించడమే నందనార్ ఏకైక లక్ష్యం!

ప్రపంచ సృష్టిలో ఒక విధమైన క్రమం ఉన్నది. విశ్వసృష్టిలోని పరిపూర్ణతకూ, లయకూ; అనాదికాలం నుంచి నిరంతరం, నిర్విరామంగా కొనసాగుతూన్న సృష్టి స్థితిలయాలకూ సంకేతంగా శివతాండవనృత్యాన్ని చెబుతారు!

దేవాలయానికి నాలుగువైపులా వున్న గంభీరమైన గోపురాలలో భరతనాట్యానికి సంబంధించిన 108 భంగి మలను శిల్పాలుగా మలిచి అమర్చారు.

ఆలయం ఎప్పుడు నిర్మించబడిందో స్పష్టంగా తెలియదు. నటరాజును తమ రక్షకుడుగా భావించిన చోళరాజులు ఆలయ గోపురశిఖరాన్ని బంగారు రేకులతో పొదిగారు. పాండ్యులు, నాయకరాజులు కూడా ఆలయాభివృద్ధికి కృషి చేశారు.

చిదంబర ఆలయానికి సంబంధించిన అత్యంత ఆసక్తికరమైన ఉదంతం నందనార్ కథ. సేక్కిళార్ పెరియ పురాణంలోనూ, గోపాలకృష్ణ భారతి నందనార్ చరిత్రంలోనూ ఈ అద్భుత కథకు అమరత్వం ప్రసాదించారు. నందనార్ మట్టిలో మాణిక్యం. తప్పెటలు వాయించే 'పరయా' కుటుంబంలో పుట్టినప్పటికీ, అతనిలో బాల్యం నుంచే శివభక్తి మెండు. పిల్లలందరూ మట్టితో బొమ్మలు చేసి ఆడుకుంటుండగా, అతడు శివలింగాన్ని చేసి పూజించేవాడు. చిదంబర ఆలయంలోని తిల్లై నటరాజును దర్శించాలన్నది ఆయన జీవితలక్ష్యం. అందరితోనూ ''చిదంబరానికి రేపు వెళతాను,'' ''రేపువెళతాను,'' అని చెప్పేవాడు. ఆ కారణంగా అసలు పేరు మరుగున పడిపోయి అందరూ అతన్ని 'రేపు వెళ్ళేవాడు' అని పిలవసాగారు.ఆఖరికి ఇక ఎడబాటును భరించలేక నందనార్ చిదంబరానికి బయలుదేరాడు.

తీరా ఆలయాన్ని సమీపించేలోగా అతనికి తన కడజాతి గుర్తు రావడంతో భయంతో వణికిపోతూ నగర శివార్లలోనే ఆగిపోయాడు.చాలా రోజులు నగరాన్ని చుట్టిరావడం తప్ప, గుడిని సమీపించే సాహసం చేయలేక

పోయాడు. తనకూ, తాను కొలిచే దేవుడికీ మధ్య అడ్డుగోడగా వున్న తన కులాన్ని తలుచుకుని బాధపడుతూ అలాగే ఒక చెట్టు కింద పడుకుని నిద్రపోయాడు. అతనికి శివుడు కలలో కనిపించి గుడిలోకి రమ్మని పిలిచాడు. ఆ రాత్రే శివుడు ఆలయ పూజారుల కలలోనూ కనిపించి, తన ప్రియతమ భక్తుడు గుడికి వస్తున్నాడనీ, ఆయనకు స్వాగతం పలకడానికి ఆయత్తం కమ్మనీ వారిని ఆజ్ఞాపించాడు.

భక్తిపారవశ్యంతో నందనార్ ఆలయంలో అడుగుపెట్టి శివదర్శనానికి కనకసభను చేరాడు. అమితాశ్చర్యంతో పూజారులు చూస్తూండగానే శివుడిలో లీనమైపోయాడు!

కొడగు కొండలలో చిన్నపాయగా పుట్టి, ప్రవహించే ప్రాంతాలను సస్యశ్యామలం చేస్తూ, దాదాపు 765 కి.మీ. ప్రయాణంచేసే కావేరీనది పూంపుహార్ వద్ద సముద్రంలో సంగమించేప్పుడు, మరీ పలచబడి చిన్న నీటిపాయలా కనిపిస్తుంది!

పూంపుహార్ అనే కావేరీ పూంపట్టణం చోళుల ప్రాచీనరేవు పట్టణం. గ్రీకు భూగోళ శాస్త్రవేత్త టోలమీ వర్ణించిన 'చాబరిస్ ఎంపోరియమ్' పట్టణం ఇదే. క్రీ.శ.2వ శతాబ్దంలో కడలి కబళించేంత వరకు గొప్పనగరంగా వెలసిన పూంపుహార్ నుంచి రోమ్‌నగరానికి సముద్రవ్యాపారాలు జరిగేవి. ఓడల రాకపోకలు ఉండేవి. పురాతత్వశాఖ ఇటీవల ఇక్కడి సముద్రగర్భంలో జరిపిన తవ్వకాలలో క్రీ.పూ. 3-క్రీ.శ.2వ శతాబ్దం మధ్యకాలానికి చెందిన కట్టడాలు, మరికొన్ని ఇటుకగోడలు బయటపడ్డాయి. గోవాలోని సముద్ర పరిశోధన జాతీయ సంస్థ జరిపిన పరిశోధనలో పూంపుహార్ తీర సముద్రంలో రేవుగోడలు కొన్ని బయటపడ్డాయి. ఈ ప్రాంతంలో జరిపిన మరికొన్ని పరిశోధనల వల్ల- టెర్రకోట పళ్ళాలు, రోమన్‌నాణాలు, బావులు, ఇటుకలు, ఎర్ర, తెల్ల కుండ పెంకులు బయట పడ్డాయి.

పల్లవనేశ్వరం అనే అందమైన దేవాలయ సమీపంలో ఒక బౌద్ధవిహారం ఉన్నట్టుకూడా ఆధారాలు బయటపడ్డాయి.

1970 లలో పూంపుహార్‌లో ఏడంతస్థుల శిలప్పదిగార కళాభవనం నిర్మించబడింది. ఇళంగో అడిగళ్ రచించిన శిలప్పదిగారం అనే అద్భుత తమిళ కావ్యం నుంచి కొన్ని దృశ్యాలను ఇక్కడ అందమైన శిల్పాలుగానూ, చిత్రాలుగానూ చిత్రించి ఉన్నారు. పూంపుహార్‌లో నివసించిన సంపన్న వర్తక కుటుంబానికి చెందిన కొత్త దంపతులైన కణ్ణగి, కోవలన్‌ల కథను ఇళంగో అడిగళ్ శిలప్పదిగారంగా రచించాడు. కోవలన్, మాధవి అనే రాజ నర్తకి మోజులో పడి ఆమె ఇంటచేరాడు. కణ్ణగి తన భర్త తిరిగి రావాలని ప్రార్థనలు చేస్తూ, ఇంట్లోనే ఓర్పుతో ఎదురు చూడసాగింది.



చిదంబర ఆలయంలోని ప్రధానదైవం నటరాజు



తన కాలి అందెను పగులగొట్టి అందులో ఉన్నవి కెంపులని నిరూపిస్తున్న కణ్ణగి

కొంతకాలానికి కోవలన్ సంపదలన్నిటినీ పోగొట్టుకుని, తన తప్పును గ్రహించి, పశ్చాత్తాపంతో ఇంటికి తిరిగి వచ్చాడు. భార్యా భర్తలు అక్కడవుండలేక, బతుకు తెరువు వెతు క్కుంటూ మధురకు బయలుదేరారు. మార్గ మధ్యంలో ఉన్న దృశ్యాలను, ముఖ్యంగా, కావేరీనది అందచందాలను ఇళంగో అడిగళ్ అద్భుతంగా వర్ణించాడు. మధురకు చేరాక, కోవలన్ తన భార్య కణ్ణగి తీసి ఇచ్చిన కాలి అందెను అమ్మి డబ్బు తేవడానికి స్వర్ణకారుడి వద్దకు వెళ్ళాడు. పాండ్య రాణి నుంచి అప్పటికే ఒక అందెను దొంగిలించిన ఆ స్వర్ణకారుడు, కోవలన్ రాకను అవ కాశంగా తీసుకుని, ఆ నిందను కోవలన్‌పై మోపి, అతనివద్ద వున్న అందె మహారాణిదేనని రాజుకు చెప్పాడు. రాజు విచారణ జరపకుండా, స్వర్ణకారుడి మాట నమ్మి కోవలన్‌కు మరణశిక్ష విధించాడు. అది అమలుపరచబడింది. విషయం తెలియగానే కణ్ణగి కోపావేశంతో పాండ్యరాజ సభలో తుఫానులా ప్రవేశించి- రాణిగారి అందెను తీసి పగుల గొట్టి అందులో ఉన్నవి ముత్యాలనీ, తన అందెలో ఉన్నవి కెంపులనీ నిరూపించింది. అసలు దొంగ తన భర్తకాడనీ న్యాయాన్యాయాలు తెలుసుకోకుండా నిరాపరాధికి శిక్ష విధించిన రాజే దొంగ అని నిందించింది.

తన తొందరపాటు వల్ల ఒక నిరపరాధి ప్రాణం కోల్పోయాడన్న బాధతో రాజు సింహాసనం మీదే ప్రాణం వదిలాడు. భర్త మరణాన్ని భరించలేక రాణీ మరణించింది. అయినా, కణ్ణగి ఆగ్రహం చల్లారలేదు. అరాచకానికి చోటిచ్చిన మధురను శపించింది. మధురానగరం అగ్ని కీలలకు ఆహుతయింది. కణ్ణగి నగరాన్ని వదిలి వెళ్ళి, పడమటి కొండలను చేరుకున్నది.

కావేరీనది మళ్ళీ సముద్రంలో సంగమించేనట్టే- కణ్ణగి తన భర్త కోవలన్‌ను మళ్ళీ శాశ్వతంగా చేరుకోవడానికి దివినుంచి వచ్చిన దివ్యరథంలో బయలుదేరి వెళ్ళింది!



పూంపుహార్ వద్ద కావేరీ సముద్రంలో సంగమిస్తుంది



# రంగడి కథ

రంగడికి కథలు చెప్పడమంటే చాలా సరదా. తండ్రికి చెబుదామంటే ఆయనకు పొలం పనులు. తల్లికి చెబుదామంటే ఆమెకు ఇంటి పనులు. తాతగారికి రోజంతా గీతా పారాయణం తోనూ, పూజలతోనూ, కబుర్ల తోనూ వెళ్ళిపోతుంది. బామ్మకు ఏ పనులూ లేవు కానీ, ఇంట్లో ఎవరూ తిన్నగా పనులు చేయడం లేదని అందరినీ సాధించడానికే, ఆవిడకు ఉన్న ఇరవైనాలుగు గంటలూ చాలవు.

ఇంట్లో ఇంకా పెళ్ళికాని మేనత్త వుంది. చెంగున గెంతులు వేస్తూ, హుషారుగా ఇల్లంతా తిరుగుతుంటుంది. రంగడు కథ చెబుతా నన్నప్పుడల్లా, "ఒరేయ్, రంగా, నేను మధురమైన కలలు కంటున్నానురా. నీ కథలు వినే తీరుబడినాకు లేదు," అంటుంది.

రంగడికి చాలామంది మిత్రులున్నారు. ఆడుకుంటానికైతే అందరూ సిద్ధమే కానీ, కథ అనగానే పరిగెత్తి పారిపోతారు. విషయమేమిటంటే -రంగడి కథలు క్లుప్తంగా వుండవు. వాడి కథ పరిమాణంతో పోలిస్తే, మహాభారతం పద్ధెనిమిది పర్వాలూ కలిపి, ఏనుగు ముందు ఎలుకలా వుంటాయి. అయితే, భారతంలో ఆసక్తికరమైన విశేషాలుంటాయి. రంగడికథ మాత్రం మామూలు ఇంట్లో విశేషాల్లా అర్థం లేకుండా అతి సామాన్యంగా కొనసాగిపోతుంది.

ఒక గంటసేపు వాడి కథ విని, "అయిపోయిందా?" అని అడిగితే, "అప్పుడేనా? ఇంకా మొదట్లోనే వున్నాం," అంటాడు వాడు కోపంగా.

రంగడు తనకు తెలిసిన విశేషాలనూ, చుట్టూ జరుగుతున్న విశేషాలనూ ఎప్పటికప్పుడు కలుపుకుంటూ, కథ చెప్పుకుపోతూంటాడు. అందుకని, వాడు కనబడగానే ఎవరైనా సరే, "కథ చెప్పొద్దు," అంటూంటారు.

తన కథలు వినేవాళ్ళెవరూ లేరని రంగడికి ఎంతో బాధగా వుండేది. వాళ్ళను వెతు



క్కుంటూ ఊరు ఊరంతా రాత్రీ పగలూ తెగ తిరిగేవాడు. అఖరికి తిండికి ఆశపడి బిచ్చగాళ్ళెవరైనా తన కథ వింటారని ఆశ పడితే, వాళ్ళు, "బాబూ! నీ కథ వినడం కంటే ఆకలే బావుంది," అనేశారు.

దయ్యాలకు కథలంటే ఎంతో ఇష్టమని తెలిసి, వాడొక రాత్రి శ్మశానానికి వెళ్ళాడు. వాడు కథ చెబుతాడని గ్రహించి, మొత్తం శ్మశానంలోని దయ్యాలన్నీ వాడి చుట్టూ చేరాయి. రంగడికి రవంత కూడా భయం వెయ్యలేదు. తన కథకు శ్రోతలు దొరికారన్న ఉత్సాహంతో వాడు వెంటనే కథ మొదలు పెట్టేశాడు. అలా ఎంతసేపు జరిగిందో తెలియదు కానీ, వాడు చెప్పే కథ నుంచి బయట పడి పరిసరాలను గమనించే సరికి చుట్టూ దయ్యాలు లేవు. మర్నాటినుంచీ శ్మశానంలో దయ్యాలు మచ్చుకైనా కనబడ్డం లేదని అంతా చెప్పుకున్నారు.

ఇలా వుండగా– రాజధానిలో రాజద్రోహి ఒకడు పట్టుబడ్డాడు. వాడికీ, రాజుగారిమీద కుట్రకూ పెద్ద సంబంధముందని అర్థమైంది కానీ, ఎన్ని చిత్రహింసలు పెట్టినా వాడు పెదవి విప్పి రహస్యంబయట పెట్టడం లేదు. వాడు పెదవి కదిపితే తప్ప, మిగతా కుట్ర దారుల గురించి తెలియదని, రాజు బెంగ పెట్టుకున్నాడు. అలాంటి సమయంలో ఆయనకు ఎవరో రంగడి కథల గురించి చెప్పారు.

"అయినా, ఇన్ని చిత్రహింసలకు లొంగని వాడు కథలకు లొంగుతాడా?" అన్నాడు రాజు.

కానీ, తరవాత ఆయన బాగా ఆలోచించి, ఏ పుట్టలో ఏ పాముందోనని చివరకు రంగడికి కబురు పంపాడు.

ఈ కబురు విని రంగడు ఎంతో సంతోషించాడు. చిత్రహింసలు భరించిన వాడికి ఓపిక చాలా ఎక్కువ కాబట్టి, ఆ రాజద్రోహి తన కథను ఎక్కువసేపు వింటాడని రంగడు చాలా ఉత్సాహపడ్డాడు. కానీ ఆ రాజద్రోహి ఒకటి రెండు గంటలు మాత్రం రంగడి కథ విని, ఘొల్లుమని ఏడ్చి తన రహస్యాలన్నీ బయటపెట్టేశాడు.

రాజు ఎంతో ఆనందపడి, రంగడికి ఘన సన్మానం చేశాడు. కానీ వాడిముఖంలో ఏ మాత్రమూ సంతృప్తి కనబడలేదు. తన కథను వినే శ్రోతకావాలనీ, తనకథను వినడమే తనకు అసలైన సన్మానమనీ వాడు, రాజుకు చెప్పాడు.

రంగడి కథకు శ్రోతను వెదికి పట్టుకోమని రాజు, మంత్రులకు చెప్పాడు. వారందరూ

ఏకకంఠంతో, "ప్రభూ! చిత్రహింసలకు లొంగని రాజద్రోహి కూడా వాడి కథను ఆ సాంతం వినలేకపోయాడు. సామాన్యుల్లో వాడి కథకు శ్రోతను వెదకడం, మావల్ల నవు తుందా? తమరు ఈ విషయమై జ్యోతిష పండితులను సంప్రదించడం మంచిది," అన్నారు.

రాజు ఆస్థాన జ్యోతిష పండితులను పిలిచి విషయం చెప్పాడు. వాళ్ళు శాస్త్ర గ్రంథాలన్నీ దీక్షగా తిరగేశాక, తమలో తాము చాలాసేపు తీవ్రంగా చర్చించుకున్నాక, రాజును కలుసు కుని, "ప్రభూ! రంగడి కథకు శ్రోతను వెద కడం మానవమాత్రుడికి సాధ్యం కాదు. ఇందుకు తప్పక దైవసహాయం కావాలి. అందుకొక మార్గం వున్నది. రంగడు తన కథను తాళ పత్రాలపై రాస్తూ, అవి చదు వుతూ భగవంతుణ్ణి పూజిస్తే, ఆయన ప్రత్య క్షమై వాడి కోరిక తీర్చే అవకాశముంది," అని చెప్పారు.

రాజు రంగడి కోసం ఒక గది ఏర్పాటు చేశాడు. బండెడు తాళపత్రాలనూ, ఘంటాన్నీ ఇచ్చాడు. రంగడు గదిలో కూర్చుని తన ముందు భగవంతుడి విగ్రహాన్ని ప్రతిష్ఠించు కున్నాడు. ఘంటాన్ని చేతబట్టి తాళపత్రాల మీద రాస్తూ, ఆ వాక్యాలను పైకి చదువుతూ, వాటినే పూజాపుష్పాలుగా భగవంతుడి విగ్ర హంపై వేయసాగాడు. అలా కొంతసేపు జరిగే సరికి, వాడి ముందు భగవంతుడు ప్రత్య క్షమై, "నాయనా, నీ పూజ ఇక ఆపు!" అన్నాడు.

రంగడు ఎంతో వినయంగా చేతులు జోడించి, "స్వామీ! నాజన్మ ధన్యమైంది. తమరు నా కథకు శ్రోతను ప్రసాదించండి," అన్నాడు.





తటాకంలోని నీళ్ళలోతును బట్టి తామరతూడు పొడవు వుంటుంది. అలాగే మనిషి మనసును అనుసరించే అతని ఔన్నత్యం ఉంటుంది. -తిరుక్కురళ్

భగవంతుడుమందహాసంచేసి, ''నాయనా! రామావతారాన్ని ద్వాపరయుగం భరించలేదు. కృష్ణావతారాన్ని కలియుగం భరించలేదు. ఈ సృష్టిలో ప్రతి విశేషానికీ సమయాసమయాలుంటాయి. సమయం వచ్చేదాకా నీవు నీ కథను తాళపత్రాలపై రాస్తూండు,'' అన్నాడు.

''అయితే, నాకథకు శ్రోత ఎప్పుడు లభిస్తాడు, స్వామీ?''అని అడిగాడు రంగడు.

''ఒకరు కాదు, లక్షలాది శ్రోతలు లభించేలా నీకు చేయగలను. అయితే ఒక్క నియమం. నీ కథను నువ్వు మనసులో అనుకోవాలే తప్ప, నా విగ్రహం ముందు పైకి చదవ కూడదు,'' అన్నాడు భగవంతుడు.

''తప్పకుండా తమరు చెప్పినట్లే చేస్తాను. నాకు శ్రోతలు దొరికే సమయం ఎప్పుడు వస్తుందో చెప్పండి, స్వామీ!''అన్నాడు రంగడు.

''ఇప్పటినుంచి కొన్ని వందల సంవత్సరాల తర్వాత, భారతదేశాన్ని విదేశీయులు పాలిస్తారు. విదేశీపాలన నుంచి విముక్తి లభించిన ఏబది సంవత్సరాలకు, భారతదేశంలో బహురూపి అనే యంత్రం పుంజుకుంటుంది. నీ కథ వున్న తాళపత్రాలను, ఈ రాజు జాగ్రత్తగా భద్రపరుస్తాడు. ఆ బహురూపి యంత్రంలో నీ కథ నాటకాలుగా ప్రదర్శితమై ఎందరో ప్రేక్షకులను సంపాదించుకుంటుంది. వివిధ రకాల పేర్లతో నీ కథ ఒక శతాబ్దం పాటు ఆగకుండాప్రేక్షకుల ముందు ప్రదర్శించ బడుతుంది. వారి కోసం ఇప్పుడు నువ్వు ఆగకుండా కథను రాస్తూవుండు,'' అని భగవంతుడు, రంగడికి చెప్పి మాయమయ్యాడు.

ఆ విధంగా, నేటి బహురూపి యంత్రం కోసం రంగడి కథ భద్రపరచబడి, ఇప్పటికి విముక్తిని పొందింది.





# మతి మరుపు

బల్లిపాలెం గ్రామంలో వుండే బసవయ్య అనే వడ్ల వ్యాపారి, గ్రామాధికారితో పనిబడి, ఇంటి నుంచిబయల్దేరాడు. ఆయన గ్రామం మధ్యకు చేరేసరికి, ఇద్దరు వ్యక్తులు తగువు పడుతూండడమూ, కొందరు వారిచుట్టూ చేరి చోద్యంచూస్తూండడమూ కంటబడింది.

బసవయ్య, తగువులాడేవాళ్ళ ముందుకు పోయి, "గ్రామం మధ్యలో ఏమిటీ తగాదా?" అంటూ ఆరాతీశాడు.

వాళ్ళిద్దరిలో, రంగయ్య అనేవాడు, బసవయ్యతో, "అయ్యా, ఈ మంగయ్య అత్తవారి ఊరూ, నా అత్తవారి ఊరూ ఒకటే. మూడు నెలల క్రితం, ఈయన ఆ గ్రామం వెళ్ళాడు. అక్కడ నా బావమరిది కనిపించి, నాకు అంద జేయమని వెయ్యిరూపాయలు ఇచ్చాడు. కానీ, ఈ మంగయ్య ఆ డబ్బునాకు అందజేయటం మాటఅలావుంచి, కనీసం ఆ సంగతి కూడానాకుచెప్పలేదు. నిన్ననే, నా బావమరిది నుంచి విషయం తెలిసింది. ఇన్నాళ్ళు నా సొమ్ము వాడుకున్నందుకు గాను, వడ్డీలెక్క కట్టి ఇవ్వమంటున్నాను," అన్నాడు.

అప్పుడు మంగయ్య చేతులు జోడించి బసవయ్యతో, "అయ్యా, రంగయ్య చెప్పింది నిజమే! కానీ, నాకే దుర్బుద్ధీ లేదు. ఈయన సొమ్ము నేను దేనికీ వాడుకోలేదు. ఊరినుంచి వస్తూనే కొన్ని చిక్కువ్యవహారాల్లో పడి, ఆ సొమ్ము సంగతి మరిచాను తప్ప, మరొకటి కాదు. దాంతోపాటు, వడ్డీ కూడా ఇవ్వమనడం, న్యాయమా?" అన్నాడు.

"మరిచిపోయాను అని ఒక్క మాటలో తేల్చి వేయడానికి, అదేమీ పాతికా పరకాకాదు; ఏకంగా వెయ్యిరూపాయలు!" అన్నాడు రంగయ్య వెటకారంగా.

"వెయ్యి రూపాయలు అయినంత మాత్రాన మరిచిపోకూడని ఏమైనా శాసనం వున్నదా?" అన్నాడు మంగయ్య.

"శాసనంకాదు, శాస్త్రంవున్నది!" అంటూ అక్కడి వాళ్ళలో ఒకడు నవ్వాడు.

బసవయ్య ఆ నవ్విన వాడికేసి కోపంగా చూసి, రంగయ్య మంగయ్యలతో, "మతి మరుపన్నది, మనుషులకే కాదు, సర్వప్రాణి కోటికీ సహజం. నాకు మతిమరుపు లేదు,

వి. ఉమాదేవి

అని ఎవడైనాఅంటే, వాడి ఆరోగ్యం సరిలేదని వెంటనేమనం గ్రహించవచ్చు. నన్నే చూడండి! ఉదయం స్నానం చేస్తూ, మెడలోని పులిగోరు గొలుసు తీసి, నూతిగట్టుపై పెట్టాను. అంతే! తర్వాత దానిసంగతే మర్చిపోయాను. గొలుసు విలువ రెండువేలుంటుంది. అంత విలువైన దాన్ని ఎలా మర్చిపోయావని, ఎవరైనా అడిగితే, నేనేం చెప్పగలను? మీ తగాదా అప్పిచ్చి పుచ్చుకోవడం కాదు కాబట్టి, వడ్డీ గొడవ వదిలేయండి!'' అని ఇద్దరికీ నచ్చజెప్పి, ఒప్పించి, తగాదా పరిష్కరించి మరీ ముందుకు కదిలాడు.

ఇంటికి తిరిగి వస్తున్న బసవయ్యకు ఆయన భార్య ఎదురొచ్చి, ''మెడలో పులిగోరు గొలుసు లేదేమండీ?'' అని అడిగింది.

''అదా! ప్రొద్దునస్నానం చేస్తూగొలుసును నూతిగట్టుపై పెట్టి మర్చిపోయాను,'' అన్నాడు బసవయ్య.

''ఆ సంగతి, సరే! ఇంతకు పావుగంట ముందు ఎవరో వచ్చి, 'అయ్యగారు నూతి గట్టున గొలుసు పెట్టి మరిచిపోయారట. నన్ను పట్టుకు రమ్మన్నారు,' అనిచెప్పగా, గొలుసు వాడికిచ్చి పంపాను. ఇప్పుడది మీ మెడలోలేకపోవడం చూసిఅడుగుతున్నాను,'' అన్నది బసవయ్యభార్య కన్నీళ్ళపర్యంతమై పోతూ.

ఎవడో దొంగవెధవ తగువు తీర్చే సందర్భంలో తను అన్న మాటలు విని, గొలుసు దొంగిలించుకు పోయాడని గ్రహించిన బసవయ్య, ''మంగయ్య మతిమరుపు, రంగయ్యకు కీడేం చేయలేదు గాని, నా మతి మరుపు రెండువేల నష్టానికి దారితీసింది,'' అంటూ నిట్టూర్చాడు.

అంతలో ఒక ఇరవై ఏళ్ళవాడు పరుగు పరుగున అక్కడికి వచ్చి, ''అయ్యా, ఏమనుకోకండి, నేను రంగయ్య గారి పాలికాపు లింగన్న కొడుకును. గ్రామంలో చిన్నాపెద్ద తగవులు తీర్చే తమరు, ఎంతో వ్యవహార జ్ఞానం కలవారు. అటువంటి మీరు, నాకూ మతి మరుపు వున్నదంటూ పులిగోరు గొలుసు మరిచిపోవడం గురించి చెప్పారు. ఇది మా యజమాని రంగయ్యగారికి చాలాచోద్యంగా కనబడింది. ఆయన ఇది నిజమో లేక హాస్యానికన్న మాటో తెలుసుకునేందుకు, నన్ను అమ్మగారి నడిగి పులిగోరు తెమ్మని పంపారు. ఒక అబద్ధం ఆడి అమ్మగారిచ్చిన పులిగోరు తీసుకుపోయాను. క్షమించండి. పులిగోరు ఇదిగో!''అంటూ బసవయ్య చేతిలో పెట్టాడు.



55. పాండవుల విజృంభణ

# మహాభారతం

యుద్ధం రెండో రోజు, మధ్యాహ్నం దాటి నాక కౌరవయోధులైన అశ్వత్థామా, కృపుడూ, శల్యుడూ పాండవయోధులైన ధృష్టద్యుమ్న, అభిమన్యులతో యుద్ధం చేశారు. తరవాత, దుర్యోధనుడి కొడుకైన లక్ష్మణుడికీ, అభిమన్యుడికీ మధ్య తీవ్రమైన ద్వంద్వయుద్ధం జరిగింది. అందులో లక్ష్మణుడు ఓడిపోతూ ఉండటం చూసి దుర్యోధనుడూ, ఇంకా అనేకమంది కౌరవయోధులూ వెళ్ళి అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు.

అభిమన్యుడు నిర్భయంగా అందరితోనూ పోరుతూ ఉండగా, అతనికి అండగా అర్జునుడు వచ్చాడు. దానిని చూసి భీష్మద్రోణులు మొదలైన మహారథులు అటు నుంచి వచ్చారు. అర్జునుణ్ణి ఆ సమయంలో ఎదుర్కోవటం ఎవరివల్లా కాలేదు. అతను ప్రళయకాల రుద్రుడిలాగా కౌరవసేనలను చించి చెండాడుతుంటే, చచ్చినవారు చావగా, మిగిలినవారు పారిపోసాగారు.

భీష్ముడు ద్రోణుడితో, "అర్జునుడు ఇలా యుద్ధం చేసేటప్పుడు అతనిముందు ఎవరూ నిలవలేరు. పారిపోయే మన సైన్యాన్ని వెనక్కు తిప్పటం సాధ్యంకాదు. అదీగాక సూర్యుడు అస్తమించబోతున్నాడు. ఇవాళకు యుద్ధం ఇంతటితో ముగించటం మేలనిపిస్తుంది," అన్నాడు.





మూడో రోజు ఉదయం కౌరవసేనలు గరుడవ్యూహంలోనూ, పాండవసేనలు అర్ధ చంద్రవ్యూహంలోనూ యుద్ధానికి సిద్ధమ య్యాయి. యుద్ధం ఆరంభమవుతూనే దుర్యోధనుడు రథబలాలను వెంటబెట్టుకుని ఘటోత్కచుణ్ణి ఎదుర్కొన్నాడు. పాండవులు భీష్మ ద్రోణులను ఎదుర్కొన్నారు. అభి మన్యుడూ, సాత్యకీ శకునిని ఎదుర్కొన్నారు. అర్జునుడు రథ యోధులను విపరీతంగా వధ చెయ్య సాగాడు. అదేవిధంగా భీష్మద్రోణులు పాండవ సేనలను నిర్మూలించసాగారు. అయితే భీముడూ, ఘటోత్కచుడూ కలిసి కౌరవసేనను తరమసాగారు. ఆ సేనను మళ్ళించటం భీష్మ ద్రోణుల తరం కాలేదు. ఆ పని దుర్యోధనుడు చెయ్యగలిగాడు. దుర్యోధనుడి సేనలు మరలటం చూసి, పారిపోయే ఇతర సేనలు సిగ్గుపడి తాము కూడా మరలి యుద్ధానికి వచ్చాయి.

దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వచ్చి నిష్ఠురంగా, "తాతా, నువ్వు యుద్ధరంగంలో ఉండగానే మన సేనలు చెదరి పారిపోవటం నీ కెంత అవమానం? నీకు పాండవుల పట్ల అంతదయ ఉన్నట్టయితే, యుద్ధానికి ముందే, 'నేను పాండవులతోనూ, సాత్యకి తోనూ, ధృష్ట ద్యుమ్నుడితోనూ యుద్ధం చెయ్యను,' అని చెప్పి ఉండవలసింది. మీ రందరూ మీ పరా క్రమాలకు తగినట్టుగా యుద్ధం చెయ్యకపోతే నేనేమయిపోతాను?" అన్నాడు.

భీష్ముడు కోపంతోనే నవ్వుతూ, "పాండ వులను జయించటం దేవేంద్రుడికీ, దేవత లకూ కూడా సాధ్యం కాదని నేను నీతో అన లేదా? ముసలివాణ్ణి, నాశక్తి కొద్దీ పోరాడు తూనే ఉన్నాను. నేను ఎలా పోరాడేదీ నువ్వూ, నీ వాళ్ళూ చూడండి," అన్నాడు.

పాండవులది యుద్ధంలో పైచెయ్యి అవుతూ ఉండటం చూసి భీష్ముడు మహా బీభత్సమైన యుద్ధానికి పూనుకున్నాడు. దుర్యోధనుడి సేన అంతా ఆయన వెంట ఉన్నది. ఆ పూట భీష్ముడి ఎదుటపడి దెబ్బ తిననివాడు లేడు. పాండవ సైన్యం వెయ్యి చీలికలయింది. కృష్ణా ర్జునులు చూస్తూ ఉండిపోయారే గాని భీష్ముణ్ణి నిరోధించలేక పోయారు.

బెదిరి పారిపోయే తమ సైనికులను చూసి కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా, నీ ప్రతాపం ఇప్పుడు చూపించు. కౌరవుల నందరినీ చంపేస్తానని మొదట మాట ఇచ్చావు. భీష్ముణ్ణి చూసి యోధులందరూ మృత్యు వును చూసినట్టు బెదిరిపోతున్నారు," అన్నాడు.

"కృష్ణా, మన రథాన్ని భీష్ముడికెదురు నడిపించు. అతడి అంతు తేల్చుతాను," అన్నాడు అర్జునుడు. కృష్ణుడు అలాగే చేశాడు.

భీష్ముడు ఎదురు కాగానే అర్జునుడు ఆయన చేతి విల్లును తన బాణంతో విరగగొట్టేశాడు. భీష్ముడు అర్జునుణ్ణి మెచ్చుకుంటూ, మరొక విల్లు తీసుకుని, తనతో [illegible] బయల్దేరాడు. ఇద్దరూ యుద్ధం చేస్తుంటే కృష్ణుడికి అర్జునుడు పట్టుదలగా యుద్ధం చేస్తున్నట్టు తోచలేదు. "ఈ అర్జునుడు భీష్ముడి పట్ల ఇంత గౌరవం చూపితే ధర్మరాజు సేన నశించటానికి ఎంతోకాలం పట్టదు. నేనే భీష్ముణ్ణి చంపి, పాండవుల కార్యం నెరవేర్చాలి," అనుకున్నాడతను. ఈ లోపల అర్జునుడి మీదికి కొన్ని వందల మంది కౌరవ వీరులు వచ్చి, అతన్ని చుట్టుముట్టారు. ఆ స్థితిలో సాత్యకి అర్జునుడికి అండగా వచ్చాడు. అతను పారిపోయే వారిని నిలవమని హెచ్చరించాడు. కృష్ణుడు సాత్యకితో, "సాత్యకీ, పొయ్యేవాళ్ళను పోనీ, మిగిలిన వారిని కూడా పారిపోనీ. ఈ భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, మిగిలిన కౌరవ యోధులనూ నా చక్రాయుధంతో చంపి, ధర్మరాజుకు పట్టం గట్టుతాను," అన్నాడు.

ఇలా అని కృష్ణుడు తన చక్రాయుధాన్ని [illegible] పెట్టుకుని, పగ్గాలను విడిచిపెట్టి నేలమీదికి దూకాడు. చక్రం పట్టుకుని తన పైకి వచ్చే కృష్ణుడితో భీష్ముడు శాంతంగా, "రా, నీ చేతిలో చావటం వల్ల నాకు కీర్తి, గౌరవమూ లభిస్తాయి," అన్నాడు.

కృష్ణుడు భీష్ముడి వద్దకు వచ్చి, "ఈ ప్రజాక్షయానికి మూలకారణం నువ్వే! మాయ జూదం ఆడేటప్పుడు దుర్యోధనుణ్ణి నివారించలేకపోయావు గాని, ఇప్పుడు అతణ్ణి రక్షించ





టానికి బయలుదేరావు! ఆ కులద్రోహి నీ మాట ఒకవేళ వినిఉండకపోతే వాణ్ణి ఎందుకు వదిలిపెట్టావు కావు?'' అని అడిగాడు.

''రాజు పరమదైవం కదా?'' అన్నాడు భీష్ముడు.

''యాదవులు కంసుణ్ణి వదిలి పెట్టలేదా? విపరీతబుద్ధిగలవాడు వినాశనం చెందక తప్పుతుందా?'' అన్నాడు కృష్ణుడు.

ఇంతలో అర్జునుడు తన రథం నుంచి దిగివచ్చి, కృష్ణుణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. అతను కృష్ణుణ్ణి వేడుకుంటూ, ''శాంతించు. పాండవులకు నీ కన్న వేరే గతి ఏది? నేను చేసిన ప్రతిజ్ఞ నిలబెట్టుకుంటాను. కౌరవుల నందరినీ యుద్ధంలో చంపుతానని నా బంధు మిత్రుల మీద ఒట్టు పెట్టుకుంటున్నాను,'' అన్నాడు.

ఆ మాటకు తృప్తిపడి కృష్ణుడు తిరిగి వచ్చి రథం మీద కూర్చుని, పగ్గాలు చేతబట్టి, శంఖం పూరించాడు. వెంటనే అర్జునుడు మహాదారుణమైన యుద్ధంప్రారంభించాడు. అతనితో భీష్ముడితో బాటు భూరిశ్రవుడూ, శకునీ మొదలైన కౌరవ యోధులు యుద్ధం చేశారు. అర్జునుడి బాణాలు రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ ఛేదించాయి. యోధులు తీవ్రంగా దెబ్బతిన్నారు.

త్వరలోనే విరాటుడూ, ద్రుపదుడూ మొదలైన వారు అర్జునుడికి సహాయం వచ్చారు.యుద్ధరంగమంతా పీనుగు పెంట లయింది. రక్తం ఏర్లు కట్టి పారింది. పాండవులు విజయధ్వానాలు చేశారు. అర్జునుడు ఇంద్రాస్త్రం ప్రయోగించాడు. దానితో భీష్మ, ద్రోణులూ, దుర్యోధనుడూ మొదలైన వారు వెనక్కు తిరిగారు. కౌరవ సేనలు చెల్లా చెదురుగా పారిపోసాగాయి. ధర్మరాజు యుద్ధం ముగించి తమ శిబిరానికి వెళ్ళి పోయాడు.

నాలుగోరోజు తెల్లవారగానే కౌరవ సర్వ సేనాధిపతి అయిన భీష్ముడు చాలాకోపంతో యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఆయన వెంట ద్రోణ, దుర్యోధన, బాహ్లికులు మొదలైన కౌరవవీరులు బయలుదేరారు. ఆ రోజు పాండవ సేనకు ముందు అర్జునుడు నిల బడ్డాడు.

యుద్ధం ఆరంభమవుతూనే భీష్ముడూ, అర్జునుడూ ఒకరినొకరూ ఎదుర్కొన్నారు. ద్రోణుడూ, కృపుడూ, శల్యుడూ, వివింశతీ, దుర్యోధనుడూ, మరికొందరు కూడా అర్జునుడి పైకి వచ్చారు. అలా వచ్చిన కౌరవ

వీరులను అభిమన్యుడు ఎదుర్కొన్నాడు. అర్జున, అభిమన్యులకు ధృష్టద్యుమ్నుడు తోడు వచ్చి, సాంయమని అనే యోధుడి కొడుకును చంపాడు.

అప్పుడుధృష్టద్యుమ్నుడిమీదికి శల్యుడు వచ్చాడు. ఇద్దరూ రెండు గడియల పాటు సమయుద్ధం చేశారు. ఇంతలో శల్యుడిపైకి అభిమన్యుడు వచ్చిపడ్డాడు. శల్యుణ్ణి రక్షించ టానికి వచ్చిన దుర్యోధన, దుశ్శాసన, దుర్మ ర్షణ, దుస్సహ, దుర్ముఖ, చిత్రసేనాదులు అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు. అప్పుడు భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, ఉపపాండ వులూ, నకులసహదేవులూ, అభిమన్యుడూ, వీళ్ళు పదిమందీ దుర్యోధనాదులు పది మందితో యుద్ధం చేశారు.

ఆ యుద్ధంలో భీముడు గద పట్టుకుని శల్యుడి మీదికి బయలుదేరాడు. అది చూసి దుర్యోధనుడు ఏనుగుల సేనను ముందుం చుకుని భీముణ్ణి ఎదుర్కొన్నాడు. భీముడు గర్జిస్తూ, గదతో సహా రథం నుంచి దిగి, ఏను గులను ఎడాపెడా చంపనారంభించాడు. మిగిలినతొమ్మిదిమంది పాండవ యోధులూ వెనకనుంచి అతన్ని కాపాడారు. ఆ యుద్ధంలో అనేక ఏనుగులూ, గజయోధులూ చావటం జరిగింది. ఆ సేన మాగధుడిది. అందుచేత మాగధుడు ఐరావతంలాంటి గొప్ప ఏనుగును ఎక్కి, దాన్ని అభిమన్యుడి రథం మీదికి పురి గొల్పాడు. అభిమన్యుడు ఆ ఏనుగునూ, మాగధుణ్ణి కూడా బాణాలతో కొట్టి చంపే శాడు. ఆ తరవాత భీముడి పీడనకు తట్టుకో లేక అనేక ఏనుగులు వెనక్కు తిరిగి కౌరవ సైనికులనే తొక్కుతూ పారిపోయాయి.



భీముణ్ణి చంపటానికి వచ్చిన కౌరవ వీరులకూ, భీముణ్ణి కాపాడుతున్న పాండవ వీరులకూ మధ్య తీవ్రంగా యుద్ధం జరిగింది.

పాండవ వీరులలో విజృంభించి యుద్ధం చేసినవాడు సాత్యకి. అతని దెబ్బకు ఎవరూ తట్టుకోలేకుండా ఉన్నస్థితిలో భూరిశ్రవుడు అతనితో యుద్ధానికి తలపడ్డాడు. కాని సాత్యకి ఆయనను పారదోలాడు. అప్పుడు ఉభయ పక్షాల యోధులకూ జరిగిన భయంకరమైన యుద్ధంలో భీముడు ప్రముఖంగా పోరా డుతూ ధృతరాష్ట్రుడి కొడుకులను సుషే ణుడూ, జలసంధుడూ, వీరబాహుడూ, భీమరథుడూ, సులోచనుడూ అనేవారిని చంపాడు.

భీష్ముడిది చూసి భీముణ్ణి ముట్టడించ మని తన మహారథులను ఆదేశించాడు.

వారిలో భగదత్తుడు, నరకాసురుడి కొడుకు, ఒక మదగజాన్ని ఎక్కి, భీముడి పైకి వచ్చాడు. అభిమన్యుడు మొదలైన వాళ్ళు భగదత్తుడి మీదా, అతని ఏనుగు మీదా బాణవర్షం కురిపించి, బాధించారు. భగదత్తుడు ఆ గాయపడిన ఏనుగును పాండవ సేనలపైకి పురికొల్పాడు. ఇంతేగాక భగదత్తుడు భీముణ్ణి ఒక బాణంతో మూర్ఛపోగొట్టాడు.

అదిచూసి ఘటోత్కచుడు కోపావేశం చెంది, మరొక మదగజం మీద వచ్చి, భగదత్తుడిపై కలియబడ్డాడు. వాళ్ళ యుద్ధం దారుణంగా పరిణమించింది. అందులో భగదత్తుడు చస్తాడని శంకించి,మహారథుడూ, సేనాపతీ అయిన భగదత్తుణ్ణి కాపాడుకోవటానికి ద్రోణుడూ, దుర్యోధనుడూ మొదలైనవారు సహాయం వెళ్ళారు. వెంటనే ఘటోత్కచుడికి సహాయంగా పాండవయోధులు వచ్చారు.

ఘటోత్కచుడి యుద్ధం చూసి భీష్ముడికి అసహ్యం వేసింది. ఆయన ద్రోణుడితో, "ఈ ఘటోత్కచుడు విజృంభించి ఉన్నాడు. వాడికి సహాయం కూడా బలంగా ఉన్నది. మనం అలసి ఉన్నాం. అందుచేత ఇవాళకు యుద్ధం చాలింతాం," అన్నాడు.

ఈ మాట అందరికీ నచ్చింది. అందరూ ఉపాయంగా ఘటోత్కచుడి యుద్ధం నుంచి బయటపడి, యుద్ధరంగం నుంచి వెళ్ళిపోసాగారు. అప్పుడు పాండవులు శంఖాలు పూరించి, సింహనాదాలు చేసి, భీముణ్ణీ ఘటోత్కచుణ్ణీ పొగడుతూ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. ఎవరిశిబిరాలకు వారు వెళ్ళిన అనంతరం దుర్యోధనుడు తనతమ్ములు పోయినందుకు కొంత సేపు దుఃఖించి, తరవాత తన శిబిర కృత్యాలు నిర్వర్తించి, ఆలోచనలో పడ్డాడు.

ఈ వార్తలన్నీ సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు, "సంజయా,పాండవులను తలుచుకుంటే నాకుభయంగా ఉన్నది. ఏం జరుగుతుందో తెలియటంలేదు. విదురుడు చెప్పినట్టే జరుగుతుందో ఏమో? ఎలాగైనా పాండవులు చచ్చేటందుకూ, నా కొడుకులు బతికేటందుకూ మార్గం ఉంటే చెప్పు. పాండవులు ఏదో వరం పొందిఉంటారు. దేవుడు నన్ను క్రూరంగా శిక్షిస్తున్నాడు," అన్నాడు.






# పశువేనయం

ఒక పల్లెలో సుబ్బయ్య అనే వాడికి ఒక నల్ల ఆవు ఉండేది. దానికొక దూడ ఉంటే, దురాశ కొద్దీ దాన్ని పాలుతాగనివ్వక చావనిచ్చాడు సుబ్బయ్య. ఆ తరవాత అతను ఆవుకు కూడా సరిగ్గా మేత వేసేవాడు కాడు. తెల్లవారగానే విప్పి ఊరిమీద వదిలేవాడు. అది ఎక్కడెక్కడో తిరిగి తనపొట్ట తానేపోసుకుని, సాయం కాల మయ్యాక మెల్లగా ఇంటికి తిరిగి వస్తూ ఉండేది.

ఒకరోజు సుబ్బయ్య ఆవు ఇంటికి తిరిగి రాలేదు. తప్పిపోయిన పశువులను మనుషుల చేతవెతికించే బాధ్యత గ్రామాధికారిది. అందు చేత సుబ్బయ్య బాగా పొద్దుపోయాక గ్రామాధికారివద్దకువెళ్ళి, పొద్దుననగా వెళ్ళిన తన నల్లావు తిరిగి రా లేదనీ, తప్పిపోయిందనీ తెలియ జేశాడు.

గ్రామాధికారి తన మనుషులను ఆవును వెతక టానికి పంపాడు. వాళ్ళు వెళ్ళి ఒక నల్లావును తెచ్చారు.

"ఇదేనా నీ ఆవు?" అని గ్రామాధికారి సుబ్బయ్యను అడిగాడు.

సుబ్బయ్య పోగొట్టుకున్న ఆవు బక్కచిక్కినది. ఈ ఆవు పుష్టిగా ఉన్నది. సుబ్బయ్య తప్పిపోయిన తన బక్క ఆవుకు బదులు దీనినే పొందాలన్న దురాశతో, "ఇదే నాఆవు!" అన్నాడు.

"సరే తోలుకుపో," అన్నాడు గ్రామాధికారి.

సుబ్బయ్య సంతోషంగా దాన్ని తన ఇంటికి తోలుకు పోయాడు.

కానీ తీరా చూస్తే అది పాడి ఆవుకాదు, వట్టిపోయినది. ఇది తన ఆవు కాదని గ్రామాధికారికి చెప్పటానికి లేదు. తాను చెప్పిన అబద్ధం బయటపడి గ్రామాధికారి ఆగ్రహానికి గురికావలసి వస్తుంది. అందుచేత సుబ్బయ్య ఆ ఆవును తన ఇంటనే కట్టేసి, తిండీనీరూపెట్టకుండా దాన్ని ఎండగట్టుతూ, తాను కూలిపనులుచేసుకుని బతకసాగాడు.

25– ఏళ్ళ నాటి చందమామ కథ

సుబ్బయ్య తెచ్చుకున్న ఆవు కాళయ్య అనే వాడిది. మేయడానికి వెళ్ళిన తన ఆవు ఇంటికి రాలేదని కాళయ్య కొంత ఆలస్యంగా తెలుసుకుని, గ్రామాధికారి దగ్గిర ఫిర్యాదు చేశాడు.

గ్రామాధికారి కాళయ్య పోగొట్టుకున్న నల్లావును వెతకటానికి తన మనుషులను పంపాడు.

ఎక్కడో ఊరి పొలిమేరలో వారికి సుబ్బయ్య ఆవు దొరికింది.

''ఇదేనా నీ ఆవు?'' అని గ్రామాధికారి కాళయ్యను అడిగాడు.

ఇది బక్కచిక్కిన ఆవు. కాని దాని పొదుగు చూస్తే అది పాడి ఆవు లాగా కని పించింది. మేత బాగా పెడితే త్వరలోనే ఒళ్ళు చేస్తుంది. ఈ ఆవు తనది కాదంటే అసలు ఆవు లేకుండా పోతుంది అని ఆలోచించాడు.

''అవును. ఇదే నా ఆవు!'' అన్నాడు కాళయ్య.

గ్రామాధికారి అనుమతితో కాళయ్య ఆ ఆవును తన ఇంటికి తోలుకుపోయి, దానికి పుష్టిగా తిండిపెట్టి పోషించసాగాడు. కొద్ది రోజుల్లోనే అది బాగా ఒళ్ళు చేసి, పాలు కూడా సమృద్ధిగా ఇవ్వటం మొదలు పెట్టింది.

ఈ లోపుగా సుబ్బయ్య వద్ద ఉన్న కాళయ్య ఆవు తిండి లేక మరీ బక్క చిక్కి పోయింది.

కొంతకాలంగడిచింది.ఒకనాడుసుబ్బయ్య తన పాడిఆవు కాళయ్య ఇంట ఉన్నమాట తెలుసుకున్నాడు.

అతను కాళయ్య వద్దకు వెళ్ళి, ''మన ఆవులు మారుపడ్డాయి. నా పాడి ఆవు నీకూ, నీ వట్టిపోయిన ఆవు నాకూ వచ్చింది. నా



ఆవును నా కిచ్చి, నీఆవును నువ్వు తీసుకో,'' అని పేచీ పెట్టాడు.

''ఈ ఆవును నాకు గ్రామాధికారి ఇప్పించాడు. నీకేమన్నా ఆక్షేపణలుంటే వెళ్ళి ఆయనతో చెప్పుకో,'' అన్నాడు కాళయ్య కోపంగా.

సుబ్బయ్య గ్రామాధికారి వద్దకు వెళ్ళి, పొరపాటు జరిగిందనీ, తన ఆవు కాళయ్యకూ, కాళయ్య ఆవు తనకూ మారిందనీ చెప్పుకున్నాడు.

గ్రామాధికారి ఇద్దరినీ, వారి వద్ద ఉన్న ఆవులనూ తనఎదుటికి తెప్పించి, సుబ్బయ్య చెప్పేది నిజమేనా అని కాళయ్యను అడిగాడు.

''నిజమే కావచ్చు. కాని సుబ్బయ్య వద్ద వున్న ఆవు మరీ బక్కచిక్కి ఈ రోజో రేపో పోయేదానిలా వున్నది. దాన్ని సుబ్బయ్య బలవపెట్టితేనే గాని నేను తీసుకోను. బాగా బక్కచిక్కిన అతని ఆవును నేను పుష్టిగా చేశాను,'' అన్నాడు కాళయ్య.

ఈ మాట నిజమని గ్రామాధికారికి తెలుసు. అందుచేత ఆయన సుబ్బయ్యకు నెల రోజులు గడువిచ్చి ఈలోగా బాగా తిండి పెట్టి కాళయ్య ఆవును మునుపటిలా బలవపెట్టమన్నాడు.

చేసేది లేక సుబ్బయ్య నెలరోజుల పాటు కాళయ్య ఆవును బాగా మేపి గ్రామాధికారి వద్దకు తెచ్చాడు.

''ఇక నీ ఆవును నువ్వు తీసుకుపో!'' అన్నాడు గ్రామాధికారి సుబ్బయ్యతో.

సుబ్బయ్య తన ఆవును తీసుకు పోవటానికి ప్రయత్నించగా, అది రాలేదు. కోపం వచ్చి సుబ్బయ్య దాన్ని కర్రతో గట్టిగా కొట్టాడు.

ఆవు అతని మీద ఎదురు తిరిగి, కొమ్ములతో అతని డొక్కల్లో కుమ్మింది.

''లాభంలేదు, సుబ్బయ్యా. అది నీ దగ్గరికి రాదు. అది నీదే కావచ్చు గాని, నిన్ను యజమానిగా ఆమోదించదు. నువ్వు తిండి పెట్టక దానికి చాలా ద్రోహం చేశావు. నెల్లాళ్ళుగా తిండి పెడుతున్నావు గనక, కాళయ్య ఆవు నీ వెంట రావచ్చు. అది కూడా దూడను కన్నాక నీకు దాని పాడి దక్కుతుంది. దాన్నే తీసుకుపో!'' అన్నాడు గ్రామాధికారి.



# THE AMUL CHEESE BOY

## IN PICNIC PANIC

































ఇదొక చందమామ కానుక!

# పరోపకారి చిన్నడు

## దొంగలూ- స్వాములూ

చిత్రాలు : పాణి

చిన్నడు తన కుక్కతో గంగా పురం చేరేసరికి చీకటి పడింది. వీధులన్నీ నిర్జనంగా ఉన్నాయి. ఇళ్ళ తలుపులు మూసి ఉన్నాయి. వంచినీళ్ళ కోసం వాడు ఒక ఇంటి తలుపు తట్టగానే లోపలి నుంచి విన బడుతూన్న మాటలు టక్కున ఆగిపోయాయి.





వాడు మరొక ఇంటి దగ్గరికి వెళ్ళి తలుపు సందుల్లోనుంచి చూశాడు. దుప్పటి కప్పుకుని ఇద్దరు కూర్చుని మాట్లాడుకుంటున్నారు.



చిన్నడు "దాహంగావుంది. మంచి నీళ్ళు!" అనగానే వాళ్ళు ముసుగుదన్ని పడుకున్నారు.



ఈ గ్రామ స్థులను కూడా ఏదో భయం పట్టి పీడిస్తున్నదని, అనుకుంటూ ఒక దేవాలయాన్ని సమీపించాడు.

మంటపంలో ముగ్గురు తాగుతూ, తింటూ ఉన్నారు.













గ్రామంలో పడి దారుణంగా దొంగతనాలు చేసే దొంగలను నిర్మూలించడానికి స్వాములవారు దేవతలతో సంప్రదింపులు జరుపుతున్నాడని తెలిసి ఇందులో ఏదో మోసం వుందని చిన్నడు వారి వెంట వెళ్ళాడు.

"జై,శాంభవీ! నీకు ఏం కావాలి, నాయనా?"

"పెళ్ళి చేసుకోవాలని ఉన్నది, స్వామీ!"






"భక్తులారా! ఊళ్ళో దొంగల గురించి దేవతలతో చర్చించాను. దొంగల బారినుంచి గ్రామాన్ని కాపాడడానికి దేవతలు ఒప్పుకున్నారు. అయితే, వచ్చే శుక్రవారం దాకా దొంగలను భరించక తప్పదు. ఆ తరవాత మనకు మంచి రోజులు వస్తాయి. ఇదే దేవతల నిర్ణయం!"

అందరూ వెళ్ళిపోయారు. చిన్నడి బుద్ధి చురుగ్గా పని చేయసాగింది.

ఆ రాత్రి పెద్ద బండరాయి చాటున చిన్నడు మాటు వేసి దాగాడు. అర్ధరాత్రి సమయంలో ముగ్గురు దృఢకాయులు పెద్దపెద్ద మూటలతో స్వామి దగ్గరికి రావడం చూశాడు.

స్వామి కూర్చున్న పీఠంపై నుంచి లేచి, మూత తొలగించి, వాళ్ళు తెచ్చిన నగలూ, డబ్బూ అందులో వేసి మూత పెట్టాడు.

చిన్నడు అక్కడినుంచి గ్రామం చేరాడు.

"స్వాముల దర్శనానికి హిమాలయాల నుంచి చాలామంది యోగులు వస్తున్నారు. వారికి పందిళ్ళు వేయాలి. పారలూ, పలుగులూ పట్టుకుని బయలుదేరండి. ఇది స్వాముల వారి ఆజ్ఞ!"

చిన్నడి నాయకత్వంలో గ్రామస్థులందరూ ఆయుధాలతో కోలాహలంగా రావడం చూసి స్వామి బిత్తరపోయాడు. స్వామి తత్తరపాటు చూసి గ్రామస్థులు ఆశ్చర్యపోయారు.

"మోసం, గురూ!"




''అమాయకుల్ని ఎంతకాలం ఇలా మోసం చేస్తావు?'' అంటూ చిన్నడు స్వామి పెట్టుడుగడ్డం, జుట్టూ పట్టి లాగాడు. అవి ఊడి వచ్చాయి.





గ్రామస్థులు దొంగస్వాములను పట్టుకుని చితకబాదారు. చిన్నడు వాళ్ళను వారించి పీఠం అడుగునవున్న నగలనూ, ధనాన్నీ గ్రామపెద్దలకు చూపించి ఎవరి నగలు వారికి దక్కేలా చేశాడు.



దొంగస్వామినీ, శిష్యులనూ కారాగృహంలో బంధించాక, చిన్నడు తన కుక్కతో సహా అక్కడి నుంచి మరొక ఊరికి బయలుదేరాడు.



# చందమామ

## భారత దర్శనం పాఠకులకు క్విజ్

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈలోగా వాటి సమాధానాలు తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.



1. ఎ) భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతున్నదని కోపర్నికస్‌కు వెయ్యేళ్ళకు పూర్వమే చెప్పిన భారతీయ శాస్త్రవేత్త ఎవరు?

బి) భారతదేశంలో ఒకచోట శివలింగం రూపు దిద్దుకుంటూ, కనుమరుగవుతూ ఉంటుంది. అదెక్కడో మీకు తెలుసా?

సి) యమధర్మరాజును దర్శించి, మరణానికి తరవాత ఆత్మకు ఏమవుతుందో తెలుసుకున్న పురాణ బాలుడు ఎవరు?

డి) ప్రాచీన భారత దేశానికి చెందిన ముగ్గురు సుప్రసిద్ధ నాస్తిక తత్వవేత్త లెవరు?

ఇ) నూతన మత సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి, దానికి ప్రాచుర్యం కలిగించ లేకపోయిన చక్రవర్తి ఎవరు?

2

ప్రాచీన కాలంలో మునులు అరణ్యాలలో నివసించే వారు. యుక్తవయస్కులైన ఒక మునికుమారుడు, వేరొక మునికుమార్తె పరస్పరం ప్రేమించుకున్నారు. త్వరలో పెళ్ళి జరిపించాలని పెద్దలు నిశ్చయించారు. అయితే, పాముకాటుకు గురై మునికుమారి అకస్మాత్తుగా మరణించింది. తీరని విషాదానికి లోనైన యువకుడు మన్మథుడి సాయంతో యమలోకానికి వెళ్ళి, అక్కడున్న తన ప్రియురాలి ఆత్మను కనుగొన్నాడు. ఆ తరవాత అతడు యమధర్మరాజును దర్శించి, తన ఆయుస్సులో సగం తన ప్రియురాలికి ఇస్తాననీ, ఆమె ప్రాణాన్ని తిరిగి ఇవ్వమనీ ప్రార్థించాడు. అందుకు యమధర్మరాజు అంగీకరించి, ముని కుమారుడి ఆయుఃకాలాన్ని రెండుగా విభజించి-కాబోయే దంపతులు అందులో సగం కాలం మాత్రమే జీవించి వుంటారని చెప్పాడు. ఆ ఒప్పందం ప్రకారం చనిపోయిన ముని కుమారి మళ్ళీ ప్రాణాలతో లేచి వచ్చింది. ప్రియురాలి కోసం తన ఆయువునే ధారపోసిన ఆ ముని కుమారుడు ఎవరు? ముని కుమార్తె ఎవరు?



## సృజనాత్మక పోటీలు

సాధారణ ప్రచురణకు ఎంపికయిన మే నెల సామెత (అరువుసొమ్ము బరువుచేటు) కథ

# నాంచారమ్మ నగుబాటు

దొంగలను చాకచక్యంగా పట్టుకున్న కాపలాదారులకు గ్రామాధికారి వద్దా, గ్రామాధికారికి గ్రామస్థుల వద్దా మంచిపేరు లభించింది. పెళ్ళికి వచ్చి, విడిది గృహంలో బసచేసిన పెళ్ళికూతురు తరఫు బంధువుల నగలు ఆ రాత్రి దొంగిలించబడ్డాయి.

పోయిన నగలు చెక్కుచెదరకుండా గ్రామాధికారికి చేరాయని తెలియగానే, అందరూ అమితానందంతో ఆయన ఇంటికి చేరారు. ''పెళ్ళికి వచ్చి మా ఊళ్ళో నగలు పోయాయన్న అపకీర్తి తొలగినందుకు నాకెంతో ఆనందంగా ఉన్నది. మీరు ఒక్కొక్కరే నా వద్దకు వచ్చి మీ నగ పేరు, తూకం, గుర్తులు చెప్పి తీసుకువెళ్ళండి,'' అన్నాడు గ్రామాధికారి.

నగలు పోగొట్టుకున్నవారందరూ ఆయన చెప్పినట్టే వచ్చి, నగలు పుచ్చుకుని తృప్తిగా వెళ్ళారు. ఆఖరున ఆయనవద్ద ఒక నగ మిగిలి పోయింది. దానిని పుచ్చుకోవడానికి ఎవరూ రాలేదు. ''నా దగ్గర ఒకే ఒక నగ మిగిలి ఉన్నది. దాని సొంతదారు మీలో లేరా?'' అని అడిగాడు గ్రామాధికారి.

''లేకేం బాబూ! అదిగో కూర్చుని కుమిలి కుమిలి ఏడుస్తున్నదే, ఆమెదే ఆ నగ! అది ఖరీదైన రాళ్ళ అడ్డిగ. నిన్న మాకందరికీ చూపించి మురిసిపోయింది!'' అన్నది గుంపులో నుంచి ముందుకు వచ్చిన ఒక పెద్ద ముత్తయిదువు.

అది విన్న గ్రామాధికారి కూర్చున్నావిడను తన దగ్గరికి రమ్మని పిలిచాడు. ఆమె లేచి ఆయన వద్దకు వచ్చిందే తప్ప, మరేమీ మాట్లాడలేక పోయింది. తలొంచుకుని మౌనంగా కన్నీళ్ళు కార్చసాగింది. గ్రామాధికారి ఆమెను ఓదార్చుతూ,''పోయిన నగ దొరికినందుకు సంతోషించక ఎందుకలా ఏడుస్తున్నావు?'' అని అడిగాడు.

అప్పటికీ ఆమె నోరు తెరవలేదు. ఏడుస్తూనే ఉన్నది. ఇక లాభం లేదనుకుని ఆమె భర్త లింగయ్య ముందుకు వచ్చి, ''ఆ నగ మా పక్కింటి సుబ్బులక్ష్మమ్మది. అప్పటికీ నేను మొత్తుకున్నాను. అరువుసొమ్ము బరువు చేటని! అయినా నామాట ఆలకిస్తే కద! నిన్న బయలుదేరేప్పుడు నగ అరువుతెచ్చుకున్నది. ఇక్కడ అందరికీ ఆ నగ తనదని గొప్పలు చెప్పుకున్నది. దాని బరువూ, గుర్తులూ చెప్పమంటే తెలిస్తే కదా చెప్పడానికి? అందుకే దానికా ఏడుపు,'' అన్నాడు బాధగా.

ఆరా తీయగా అతడు చెప్పినదంతా నిజమని రుజువయింది. నలుగురి ముందు ఇంత నగుబాటు పాలయ్యాక, నాంచారమ్మ గ్రామాధికారినుంచి నగను పుచ్చుకున్నది. ఇక ఈ జన్మలో అరువుసొమ్ముకు ఆశపడకూడదన్న నిర్ణయంతో భర్తతో కలిసి అక్కడినుంచి బయలు దేరింది.

– కె.కె.రావు



# కనకయ్య్య బంగారం!

మలయపురంలో రామదాసు అనే నిజాయితీ పరుడైన వ్యాపారి ఉండేవాడు. ఆయనకు పెళ్ళయి ఇద్దరు మగపిల్లలు కలిగారు. ఆయన భార్య జబ్బుచేసి హఠాత్తుగా మరణించింది. భార్య మరణాన్ని రామదాసు భరించలేక పోయాడు. ముక్కుపచ్చలారని తన పిల్లల ఆలనా పాలనా చూసుకునేవారు ఎవరా అని విచారపడసాగాడు. ఆఖరికి తమ పిల్లల్ని దూర గ్రామంలో వున్న వాళ్ళ మేనమామ ఇంట వదిలిపెట్టాలని నిర్ణయించాడు.

తన పిల్లలతో ఆయన అక్కడికి బయలుదేరే ముందు, భార్యనగలను ఒక పెట్టెలో పెట్టి ధనికుడైన వ్యాపారి కనకయ్య దగ్గరకువెళ్ళి సంగతిచెప్పి, "నా పిల్లల భవిష్యత్తుకు ఇదే ఆధారం. భద్రంగాదాచిపెట్టు," అన్నాడు.

కనకయ్య దానిని తీసుకుని, "ఆకాశంలో సూర్యుడున్నంత భద్రంగా, నీనగలు మాఇంట్లో ఉంటాయి, నిశ్చింతగా వెళ్ళిరా," అన్నాడు.

కొన్ని నెలల తరవాత బావమరిది ఊరి నుంచి తిరిగివచ్చిన రామదాసు కనకయ్య దగ్గిరకువెళ్ళి, నగలపెట్టెను అడిగాడు. కనకయ్య పెట్టె తెచ్చిఇచ్చాడేగాని, అందులోని నగలన్నీ నకిలీవి. రామదాసు దిగ్భ్రాంతి చెందాడు. బావమరిది ఊరువెళ్ళి జరిగిన విషయం కొడుకులకుచెప్పి,ఆబాధతోనేమరణించాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. రామదాసు కొడుకులు చదువుకుని ప్రయోజకులై, బంగారం వ్యాపారం ప్రారంభించి అంచెలంచెలుగాఎదిగి ధనవంతులయ్యారు. తన తండ్రిని మోసగించిన కనకయ్యకుతగిన గుణపాఠం నేర్పాలని ఒక పథకంతో మలయపురం బయలుదేరారు.

అన్న పొడవాటిగడ్డం, జుట్టు పెంచి సన్యాసి వేషం ధరించి, మలయపుర నదీతీరంలోని, గుడి మంటపానికి చేరాడు.

తమ్ముడు దూరదేశపు రాజకుమారుడి వేషం ధరించి, సేవకులతో కనకయ్య భవనానికి ఎదురుగా వున్న ఇంట్లో విడిది దిగాడు. వైభోగంగా గడుపుతూ, విరివిగా దానధర్మాలు చేస్తూ కనకయ్య దృష్టిని ఆకర్షించాడు.

"రైతు పొలంలో విత్తనాలను చల్లినట్టు ఈరాజకుమారుడు ధనాన్ని ఖర్చుచేస్తున్నాడు. దమ్మిడీ వేస్తే సరిపోయే బిచ్చగాడికి వరహా వేస్తున్నాడు," అనికనకయ్య వాపోసాగాడు.

ఒకరోజు కనకయ్య వెళ్ళి రాజకుమారుణ్ణి కలుసుకుని పొగిడాడు. రాజకుమారుడు అతన్ని సాదరంగా ఆహ్వానించాడు. క్రమంగా సాన్నిహిత్యంపెరిగిఇద్దరూస్నేహితులయ్యారు.

ఒకనాడు అర్ధరాత్రి సమయంలో రాజకుమారుడు దొంగలు దొంగలు అని కేకలు పెట్టాడు. కనకయ్యతో సహా ఇరుగుపొరుగు పరిగెత్తుకు వచ్చారు. కొందరు దొంగలు తన పడకగదిలోకి జొరబడి బంగారు నగల పెట్టెలను ఎత్తుకు పోవడానికి ప్రయత్నించారనీ, కేకలు పెట్టేసరికి భయపడి పారిపోయారనీ రాజకుమారుడు చెప్పాడు.

కనకయ్య ఆ అవకాశాన్ని జారవిడుచుకో కూడదనుకున్నాడు. "రాజకుమారా! భద్రత లేని ఈ చిన్న ఇంట్లో వుండడం తమకు క్షేమం కాదు. మీ సంపదలు మాభవనంలో భద్రంగా ఉంటాయి!" అన్నాడు.

"అలాగే మిత్రమా," అన్నాడు రాజకుమారుడు.

అప్పటికప్పుడే సేవకులు రాజకుమారుడి పడకగదిలో వున్న బంగారం నిండిన ఇనుపపెట్టెలను కనకయ్య భవనంలోకి చేర్చారు. ఒక విశాలమైన గదిని రాజకుమారుడికి కేటాయించి, అందులో ఆయన పడక సమీపంలో ఆ పెట్టెలను అమర్చారు.

తన అతిథిసంపదలను చూస్తున్న కొద్దీ, కనకయ్యలో ఆనందం పెల్లుబకసాగింది. దాన్ని ఎలాగైనా చేజిక్కించుకోవాలన్న కోరికతో



రకరకాల పథకాలను ఆలోచిస్తూ, అతడు కంటిమీద రెప్పవేయలేక పోయాడు.

వారం రోజుల తరవాత, రాజకుమారుడు అనారోగ్య కారణంగా ఆహారం ఏమీ తీసుకోవడం లేదని సేవకులు కనకయ్యకు చెప్పారు. కనకయ్య రాజకుమారుడి దగ్గరికి వెళ్ళి, "ఏమయింది రాజకుమారా?" అని అడిగాడు ఆదుర్దా నటిస్తూ.

"పదేళ్ళ క్రితం ఒక మహాత్ముడికి చేసిన పాప ఫలితాన్ని ఇప్పుడు అనుభవిస్తున్నాను. నాకు భూమిపై నూకలు చెల్లి పోయాయి. రాత్రి దేవుడు కలలో కనిపించి, ఉన్న సంపదనంతా, నదీతీర దేవాలయంలో వున్న సన్యాసికి దానం చేయమని ఆజ్ఞాపించాడు. నువ్వు వెళ్ళి ఆ సన్యాసిని పిలుచుకువచ్చి పుణ్యం కట్టుకో!" అన్నాడు రాజకుమారుడు విచారంగా.



దేవాలయంలో చేరిన సన్యాసిని గురించి కనకయ్య అప్పటికే విని వున్నాడు. రోజూ ఒంటికాలిపై నిలబడి తపస్సు చేస్తాడనీ, భక్తులు కానుకలుగా సమర్పించే వాటిని పేదలకు పంచి పెడతాడనీ జనం చెప్పుకో వడం విన్నాడు. కనకయ్య సన్యాసి దగ్గరికి వెళ్ళి, వినయంగా సంగతి విన్నవించాడు.

"మరణించనున్న మనిషి అంతిమ కోరి కను తీర్చడంలో నాకు ఎలాంటి అభ్యంత రమూ లేదు. అయినా, నాకు బంగారానికీ మట్టి గడ్డకూ తేడా తెలియదు. ఈ ఆలయం బంగారం భద్రపరచడానికి అనువైన స్థల మేనా?" అని సన్యాసి అనుమానం వెలి బుచ్చాడు.

"ఆ విచారం తమకు వద్దు స్వామీ! నాకు బంగారం విలువ బాగా తెలుసు. భద్రత విషయం అంటారా? మా ఇంట్లో జాగ్రత్తగా భద్రపరుస్తాను," అన్నాడు కన కయ్య ప్రాధేయపడుతూన్న ధోరణిలో.

సన్యాసి అతని ప్రార్థన మన్నించి, అతని వెంట బయలుదేరి వచ్చాడు. రాజకుమారుడి నుంచి, పెట్టెలలోని బంగారాన్ని దానంగా పుచ్చుకున్నాడు. ఆ తరవాత అతని తలను మృదువుగా స్పృశించి ఆశీర్వదించాడు. అంతే! రాజకుమారుడి వ్యాధి మటుమా యమై లేచికూర్చుని తృప్తిగా భోజనం చేశాడు.

కొన్ని రోజులు గడిచాయి. రాజకుమా రుడు తన రాజ్యానికి తిరుగు ప్రయాణ మవుతూ, సన్యాసిని కూడా తన వెంట రమ్మ న్నాడు. సన్యాసి అందుకు సమ్మతించాడు గాని, తాను దానంగా పుచ్చుకున్న బంగా రాన్ని ఎవరికైనా అమ్మాలికదా అని ఆలో చించసాగాడు. దానిని గమనించిన కన కయ్య, "మీరు ప్రయాణం హడావుడిలో వున్నారు గనక, అంగడి వీధికి వెళ్ళి వ్యాపా రులతో బేరాలాడే పనిమీకు వద్దు. ఆమొత్తం నేనే కొనుక్కుంటాను. తమరు మహాత్ములు కాబట్టి, బయటి ధరకన్నా కొంచెం ఎక్కువే మీకు చెల్లిస్తాను," అన్నాడు గంభీరంగా.

"నీ ఇష్టానుసారమే కానివ్వు, నాయనా!" అన్నాడు సన్యాసి.

కనకయ్య ఉత్సాహం కట్టలు తెంచు కున్నది. పెట్టెలలో వున్న బంగారం విలు వలో పదోవంతు అతడు సన్యాసికి చెల్లిం చాడు. అందుకే అతడు తన వద్ద వున్న ధనా న్నంతా, ఇవ్వవలసివచ్చింది. రాజకుమా రుడూ, సన్యాసీ ప్రయాణమై వెళ్ళిన కొంతసేప

టికి కనకయ్య తాను కొన్న బంగారం నుంచి ఒక కడ్డీని తీసుకుపోయి స్వర్ణకారుడికి చూపాడు. దానిని గీటురాయి మీద రాసి చూస్తూ, '' ఇది బంగారమా? భలేవాడివి! నువ్వు ఈగను గద్ద అని చెప్పగల సమర్థు డివి!'' అంటూ నవ్వాడు స్వర్ణకారుడు.

ఉన్న ధనాన్నంతా వెచ్చించి కొన్నదంతా నకిలీ బంగారం అని తెలియగానే కనకయ్య కుప్పకూలిపోయాడు. రాజు దగ్గరికి వెళ్ళి తనను ఇద్దరు మోసగించారనీ, మోసగాళ్ళను శిక్షించాలనీ మొరపెట్టుకున్నాడు.

అతన్ని మోసం చేసిన పరదేశీయులను పట్టితెమ్మని రాజు భటులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు నగరంలోనే ఉన్నారు. భటుల వెంట ధైర్యంగా రాజు సమక్షానికి వచ్చారు. విచారణ ప్రారంభమయింది:

'నేను నా బంగారాన్ని ఎవరికీ అమ్మలేదు. నేను దానిని సన్యాసికి దానంగా ఇచ్చాను. ఆయన దాన్ని పుచ్చుకుని నన్ను ఆశీర్వదించాడు. నేను ఆరోగ్యవంతుణ్ణయ్యాను. ఆ క్షణం నుంచి ఆ బంగారం ఆయనదే అవుతుంది. నాకూ, దానికీ ఎలాంటి సంబంధమూ లేదు,'' అన్నాడు రాజకుమారుడు.

రాజుగారికి అందులో తప్పేమీ కనిపించ లేదు.

''సన్యాసినైన నాకు బంగారానికీ, మట్టి గడ్డకూ తేడా తెలియదని నేను కనకయ్యకు మొదటే చెప్పాను. దానిని నేను అమ్మజూప లేదు. కనకయ్యే దానిని కొనడానికి వచ్చి, స్వయంగా ధర నిర్ణయం చేశాడు. అతడిచ్చిన ధనాన్ని, నేను నా అలవాటు ప్రకారం వెంటనే పేదలకు పంచేశాను,'' అన్నాడు సన్యాసి.

రాజుకు ఆయన మాటలూ సబబుగానే ఉన్నట్టు తోచింది. ఆయన కనకయ్యతో, ''నీకు జరిగిన నష్టానికి జాలిపడుతున్నాను. ఇదొక విచిత్రమైన పరిస్థితి. అంతకుముందే సన్యాసికి దానంగా ఇచ్చిన దానిమీద రాజకుమారుడి బాధ్యత ఏదీలేదు. దీనికి సన్యాసిని కూడా బాధ్యుణ్ణి చేయలేము. ఎందుకంటే, ఆయన దానిని నీకు అమ్మలేదు. నువ్వే ధరను నిర్ణయించి కొన్నావు. కొంటున్నది బంగారమా? కాదా? అని నువ్వు మొదటే పరిశోధించి చూడవలసింది. అలా చేయక పోవడం నీ తప్పే!'' అన్నాడు

రాజకుమారుడూ, సన్యాసీ రాజుకు కృతజ్ఞతలు తెలియజేసి, సంతోషంగా తమ స్వస్థలానికి బయలుదేరారు.



# ఫోటో
## వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ,
వడపళని
చెన్నయ్-600026





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఆగస్ట్2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.






జూన్2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
ఎస్.దేవి రమణ ప్రియ
1-172,IIIరోడ్,(మేడమీద)
అనంతపురం- 515004



మొదటి ఫోటో: ప్రేమలోని తియ్యదనం!   రెండవ ఫోటో: భారమైన పసితనం!!

# Goodies for Kiddies

*Look out for details of our NEW **long-term subscription offer** in the forthcoming issues of Chandamama.*

*Watch out for great gifts and exciting offers in our* **Goodies for Kiddies** *scheme!*



